# పురాణవాచకము

## మూఁడవతరగతి.

---

గ్రంథకర్తలు:
విద్వాన్ గరిమెళ్ళ సోమన్నగారు, ఎం. ఏ., ఎల్. టి.,
భోగరాజు నారాయణమూర్తిగారు.



పబ్లిషర్సు:

వేంకటరామ్ అండ్ కో.,

హెడ్డాఫీసు:—ఏలూరు.

---

రామా పవర్ ప్రెస్, ఏలూరు.

**1932**

Copy-right] [వెల 0—4—0.

# విషయసూచిక.


| | |
|---|---|
| 1. దశరథుని వేట | 1 |
| 2. దశరథుని శాపము | 4 |
| 3. శ్రీరాముని బాల్యము | 6 |
| 4. జటాయువు | 9 |
| 5. జటాయు మరణము | 13 |
| 6. వాలి | 16 |
| 7. సీతాన్వేషణము | 19 |
| 8. సేతుబంధనము | 23 |
| 9. విభీషణుఁడు | 26 |
| 10. రావణవధ | 28 |
| 11. రాజసూయము | 31 |
| 12. నలచరిత్ర (మొదటిభాగము) | 35 |
| 13. నలచరిత్ర (రెండవభాగము) | 39 |
| 14. ఉత్తర గోగ్రహణము (మొదటిభాగము) | 42 |
| 15. ఉత్తర గోగ్రహణము (రెండవ భాగము) | 45 |
| 16. భారత యుద్ధము | 47 |
| 17. దుర్యోధనవధ | 50 |
| 18. భీష్ముఁడు | 52 |
| 19. అంపశయ్య | 55 |
| 20. హిరణ్యకశిపుఁడు | |
| 21. నరసింహావతారము | |
| 22. కార్తవీర్యుఁడు | |
| 23. పరశురాముఁడు | |
| 24. భరతుఁడు (మొదటిభాగము) | |
| 25. భరతుఁడు (రెండవభాగము) | |
| 26. శ్రీకృష్ణుని బాల్యము (మొదటిభాగము) | |
| 27. శ్రీకృష్ణునిబాల్యము (రెండవభాగము) | |
| 28. శ్రీకృష్ణలీలలు | |
| 29. కాళీయమర్దనము | |
| 30. నీతిపద్యములు | |
| 31. విద్య | |
| 32. బాలకృష్ణుఁడు | |
| వ్యాకరణము. | |
| 1 వ పాఠము | |
| 2 వ పాఠము | |
| 3 వ పాఠము | |


Checked

# పురాణవాచకము

మూఁడవ తరగతి.

## 1. దశరథుని వేఁట.

అనఁగా అనఁగా ఒకరాజు. ఆరాజుపేరు దశరథుఁడు. అతఁడు రాజులందఱికంటె మిక్కిలి గొప్పవాఁడు.

దశరథుఁడు చాల మంచి పాలకుఁడు. ప్రజలను కన్నబిడ్డలవలె అతఁడు కాపాడుచుండెను. వానికి వేఁటాడుట చాల ఇష్టము. వేఁటలో దశరథుఁడు కడునేర్పరి. మృగము కనబడక పోయినను దాని చప్పుడునుబట్టి గుఱిచూచి బాణములతో కొట్టుచుండెడివాఁడు. కనుక రాత్రులయందు కూడ ఆరాజు వేఁటాడ గలుగుచుండెను.

ఒకనాఁటిరాత్రి ఆరాజు వేఁటకు బయలుదేఱెను. అది చీఁకటిరాత్రి. అతఁడు ప్రవేశించినది దట్టమైన అడవి. అచట చీకఁటి మిక్కిలి భయంకరముగా నుండెను. ఆ సమీపముననే సరయూనదికలదు. దశరథుఁడు ఆనదియొడ్డున విల్లు ఎక్కుపెట్టి వేచియుండెను. ఏనుఁగులు, అడవిపందులు, సింహములు మొదలగు క్రూరమృగములు ఆనదిలో నీరు

త్రాగుటకు వచ్చుచుండెను. అవి నీరు త్రాగునపుడు ధ్వని పుట్టుచుండెను. ఆధ్వనినిబట్టి గుఱిచూచి దశరథుడు బాణములు విడుచుచుండెను. ఆ బాణములు తగిలి జంతువులు చనిపోవుచుండెను. అట్లు అతడు పెక్కు మృగములను సంహరించెను.

వేట చాలించు సమయమున దశరథునకు బుడ బుడ యను చప్పుడు వినవచ్చినది. అదివిని ఒక యేనుగు నదిలో నీరు త్రాగుచున్నదని అతడు భావించెను. వెంటనే ఆ



చప్పుడునుబట్టి గుఱిచూచి ఒక వాడియైన బాణమును విడిచెను. తోడనే "హా శివ శివా! శివ శివా!" అను పెద్ద అఱపు వానికి వినబడినది.

దశరథునకు గుండె ఝల్లుమనెను. ఒడలు వణఁకెను. ఆ రోదనము ఎవ్వరిదో యని కొంచెము ముందుకు నడచెను. "శివశివా! ఏపాపాత్ముఁడు నన్ను బాణముతో కొట్టెను? నేను వానికి ఏమి అపకారము చేసితిని? ముసలిముద్దలైన నా తల్లిదండ్రులకు ఇంక ఎవ్వరు దిక్కు? అయ్యో! వారికి కన్నులు లేవు. కాళ్ళు లేవు. కన్నులును కాళ్ళును నేనే అయి వారిని రక్షించుచుంటినిగదా!" అను ఏడుపు దశరథునకు వినఁబడెను.

మాటలు:—పాలకుఁడు = రాజు, పాలించువాఁడు; నేర్పరి = నేర్పు కలవాఁడు, మృగము = జంతువు, ప్రజలు = జనులు, భయంకరము = భయమును కలిగించునది, సమీపము = దగ్గఱ, వేచియుండెను = కాచుకొని యుండెను, క్రూరమైన = హింసించునట్టి, చాలించు = ఆపివేయు, ధ్వని = చప్పుడు, పెక్కు = చాలా, సంహరించెను = చంపెను, సమయము = వేళ, భావించెను = తలచెను, పాపాత్ముఁడు = పాపము చేయువాఁడు, చెడ్డవాఁడు, అపకారము = చెడుగు, రక్షించు = కాపాడు, అగతులు = గతిలేనివారు.

ప్రశ్నలు:—దశరథుఁడు ఎట్టివాఁడు? అతఁడు దేని యందు నేర్పరి? అతఁడు రాత్రులందు ఎట్లు వేఁటాడ గలిగెను? అతఁడు సరయూనది ఒడ్డున ఎట్లు వేఁటాడు చుండెను? బుడబుడ అను ధ్వనిని అతఁడు ఏమనుకొనెను? అటులు అనుకొని ఏమి చేసెను? అంతట అతనికి ఏమి మాటలు వినబడెను?

# 2. దశరథుని శాపము.

"ఆ. మునికుమారుఁడైన ముగ్ధునన్నిటు చేసి
కాంచు లాభ మేమి గలుగ వలసి
బాణ మేసినాఁడు ప్రాణములకు నేను
వగవఁ దల్లిదండ్రు లగతు లగుట.

క. కన్నులు లేవను నెవ్వగ
యెన్నఁడు మదిఁ దోఁపకుండ నిమ్ముల నేనే
కన్నుల మాత్రై యుండితి
నన్ని విధములందు నింక నెయ్యదిగతియో?"

ఈ మాటలు వినినంతనె రాజునకు భయము, తొట్రుపాటు అధికమయ్యెను. 'పొరపాటున ఒక మనుష్యుని బాణముతో కొట్టివేసితిని' అని విచారించుచు అతఁడు ఏడుపు వినవచ్చుచున్నవైపు పోయెను.

పోయిచూడగా, నేలఁబడియున్న ఒక మునికుమారుడు వానికంటఁబడెను. ఆ బాలునకు బాణము తగిలి దేహము నుండి రక్తము కారుచుండెను. ఆ రాజు గుండెలు బాదుకొనుచు, "మునికుమారా! నీవు కమండలము నీటిలో ముంచినపుడు బుడబుడయను చప్పుడు వినఁబడెను. ఏనుఁగు నీరు త్రాగుచున్నట్లు భావించి బాణము విడిచితిని. ఈ పాపమును చేసినవాఁడను నేనే. నన్ను క్షమింపుము" అని బ్రతిమాలెను.

అప్పుడు మునికుమారుఁడు దశరథునితో ఇట్లుపలికెను. "ఓయిరాజా! నాతల్లిదండ్రులు ముసలిముద్దలు. లేవలేరు. నడువలేరు. వారికి నేనే దిక్కు. త్రాగుటకు నీరు తెమ్మని నన్ను పంపిరి. ఇప్పుడు నా ప్రాణము పోవుచున్నది. నీవే నీరు తీసికొనిపోయి వారి దాహబాధ తీర్పుము. వారు ఇచ్చటకు సమీపములోనే యున్నారు'' అనిచెప్పుచు ప్రాణమువిడిచెను.

ఆముని బాలునకు తల్లిదండ్రులపై గల భక్తికి దశరథుఁడు ఆశ్చర్యపడెను. కమండలము నిండ నీరునింపి అతఁడు బయలుదేరెను. వెదకుచు పోవుచుండ కొంచెము దూరములోనే ఆముసలిదంపతులు అతనికి కనఁబడిరి. తప్పుచేసినందున రాజు చాల భయపడుచుండెను. వారిని సమీపించి నమస్కారముచేసి నీరు అందించెను. కొడుకే అనుకొని వారు సంతోషముతో నీరు పుచ్చుకొని దప్పి తీర్చుకొనిరి.

పిమ్మట రాజు దుఃఖించుచు తాను చేసిన అపరాధమును వారికి చెప్పెను. పాపము ఆవృద్ధులు కొడుకు చావు విని ఘొల్లున ఏడ్చిరి. "ఓరీదుష్టరాజా! నీవును మావలెనే "హాపుత్ర యని ఏడ్చుచు చచ్చెదవుగాక" అని కోపముతో శాపమిచ్చిరి. పుత్రుని మరణమునకు దుఃఖించుచు వారు ప్రాణములు విడిచిరి.

శాపమునకై వగచుచు దశరథుఁడు ఇంటికి మఱలెను.

మాటలు:—కుమారుఁడు = కొడుకు, ముగ్ధుని = తెలియనివానిని, కాంచు = పొందు, ఏసి = వేసి, వగవ = విచారింప, వగ = విచారము, మది = మనస్సు, ఇమ్ముగ = చక్కఁగ, ఎయ్యది = ఏది, విధము = మార్గము, రీతి, గతి = మార్గము, వినినంతనే = వినఁగానే, అధికము = ఎక్కువ, దేహము = ఒడలు, కమండలము = మునులువాడుపాత్ర, దప్పి = దాహము, అపరాధము = తప్పు, వృద్ధులు = ముసలివారు, దుష్టులు = చెడ్డవారు, పుత్రుడు = కొడుకు.

ప్రశ్నలు:—మునికుమారుఁడు ఏమని ఏడ్చెను ? ఆ యేడ్పువిని దశరథుఁడు ఏమనుకొనెను ? రాజు చూచినప్పుడు ముని కుమారుఁడు ఎటు లుండెను ? రాజు అతనితో ఏమనెను ? బాలుఁడు రాజునకుఏమని చెప్పెను ? మునిదంపతుల దాహ మెట్లుతీరెను ? రాజు వారితో ఏమి చెప్పెను ? వారు రాజునకు ఏమి శాపమిచ్చిరి ?

---

# 3. శ్రీరాముని బాల్యము.

దశరథుఁడు చాలకాలము అయోధ్యను చక్కఁగ పాలించెను. అతనికి ముగ్గురు భార్యలు; పెద్దభార్య కౌసల్య; రెండవభార్య కైక ; మూడవభార్య సుమిత్ర. చాలకాలము వఱకు ఆ రాజునకు సంతానము కలుగలేదు.

వసిష్ఠుఁడు దశరథ మహారాజునకు గురువు. పుత్రకామేష్టి అను యజ్ఞముచేసిన పుత్రులు కలుగుదురని అతఁడు చెప్పెను. గురువుమాటమీఁద రాజు పుత్రకామేష్టియాగము

చేసెను. అంతట కౌసల్యకు రాముఁడును, కైకకుభరతుఁడును, సుమిత్రకు లక్ష్మణుఁడును, శత్రుఘ్నుఁడును పుట్టిరి.

ఆ నలుగురు అన్నదమ్ములు, చిన్నప్పటినుండి మంచి గుణములు కలిగియుండిరి. వారు చురుకుగా అన్ని విద్యలు నేర్చుకొనిరి. ఆకాలపు రాజకుమారులకంటె వారు విలు



విద్యలో గొప్పవారు. తల్లిదండ్రులు వారిని ఎంతో ముద్దుగా పెంచుచుండిరి.

ఒకనాఁడు విశ్వామిత్రుఁడు అను ముని దశరథుని యొద్దకు వచ్చెను. "ఓరాజా! నేను చేయుచున్న యజ్ఞమును దుర్మార్గులైన రాక్షసులు పాడుచేయుచున్నారు. కావున నీకొడుకులైన రామలక్ష్మణులను నాతో పంపుము. వారు రాక్షసులను చంపగలరు. నాయజ్ఞము పూర్తికాగలదు." అని కోరెను. రాజు మునీశ్వరుని మాట దాఁటలేక, రామలక్ష్మణులను పంపెను.

విశ్వామిత్రుఁడు వారిని వెంటఁబెట్టుకొని పోయి తన యాశ్రమమును చేరెను. ఆమహాముని యజ్ఞమును ప్రారంభించెను. మునుపటి వలెనే క్రూరరాక్షసులు అక్కడకు వచ్చిరి. యజ్ఞమును పాడుచేయుటకు యత్నించిరి. రామలక్ష్మణులు ఆ రక్కసులను సంహరించిరి. విశ్వామిత్రుని యజ్ఞము విఘ్నము లేకుండ పూర్తియయ్యెను. రామలక్ష్మణులు గొప్ప వీరులని ఆముని చాల సంతోషించెను. అక్కడనుండి విశ్వామిత్రుఁడు వారిని మిథిలానగరమునకు దీసికొనిపోయెను.

ఆపట్టణమును జనకుఁడు అను రాజు ఏలుచుండెను. అతనికి సీత యను చక్కని కూఁతురు కలదు. సీతకు పెండ్లియీడు వచ్చెను. ఆమెకు తగిన మగనికై జనకుఁడు యోచించుచుండెను. తన గృహములో నున్న శివధనుస్సును విఱిచినవానికి సీతను ఇచ్చెదనని అతఁడు చాటించెను.

చక్కని చుక్కయైన ఆ బాలికను పెండ్లాడుటకు ఎందఱో రాజకుమారులు వచ్చిరి. కాని వారిలో ఎవ్వరును ఆ విల్లు విఱువలేకపోయిరి. శ్రీరాముఁడు ఆగొప్ప ధనుస్సును నిముసములో ముక్కలు చేసెను. అందఱును శ్రీరాముని మెచ్చుకొనిరి.

శ్రీ సీతారాముల వివాహమును జనకుఁడు మిక్కిలి వేడుకతో జరిపెను.

**మాటలు:**—బాల్యము = చిన్నతనము, సంతానము=పిల్లలు, మహారాజు = గొప్పరాజు, దుర్మార్గులు = చెడ్డత్రోవల పోవువారు, చెడ్డవారు, ఆశ్రమము = ముని యుండుచోటు, విఘ్నము=ఆటంకము, వీరులు= పౌరుషము కలవారు, నగరము = పట్టణము, ప్రారంభించెను = మొదలుపెట్టెను, వేడుక = ముచ్చట.

**ప్రశ్నలు:**—దశరథుఁడు ఏ యాగము చేసెను ? దానిని ఎందుకు చేసెను ? దశరథుని భార్యల పేరులు ఏమి ? వారి కొడుకుల పేరులు ఏమి ? రామలక్ష్మణులను విశ్వామిత్రుఁడు ఏల తీసుకొనిపెళ్ళెను ? వారు ఆతనికి ఏమి సాయము చేసిరి ? జనకుఁడు సీతను ఎవరికి ఇచ్చి పెండ్లిచేసెను ? ఎందుచేత ?

---

# 4. జ టా యు వు .



దశరథుఁడు ముసలివాఁడగుటచేత రామునికి రాజ్యము ఇయ్యదలచెను. శ్రీరాముని పట్టాభిషేకమునకు మహూర్తము

నిశ్చయించిరి. కాని దశరథుని రెండవ భార్య యగు కైక రాముని పట్టాభిషేకమునకు అడ్డుపడెను.

పూర్వము ఒకప్పుడు దశరథుఁడు కైకకు రెండు వరములు ఇచ్చెను. ఆమె ఆ రెండు వరములు ఇప్పుడు ఇమ్మని భర్తను అడిగెను. మొదటివరము—రాముని పదునాలుగు ఏండ్లు అడవిలో ఉండుటకు పంపుట; రెండవది తన కొడుకు భరతునకు పట్టాభిషేకము చేయుట.

ఆ రాజు అన్నమాట తప్పడు. అందుచేత ఆ వరములు కైకకు ఇయ్యక తప్పలేదు. కైక చేసిన మోసమునకు దశరథుఁడు దుఃఖించుచుండెను. ఆ సంగతి అంతయు రామునకు తెలిసెను. వెంటనే ఆతఁడు తండ్రిని ఓదార్చి అడవికి పోవుటకు సిద్ధపడెను. రాముఁడు ఎంత చెప్పినను మానక సీతయు లక్ష్మణుఁడును కూడ వానితో బయలుదేఱిరి

సీతారామలక్ష్మణులు ముగ్గురును అడవులకు పోగానే దశరథుఁడు "హాపుత్రి! హాపుత్రి!" అని ఏడ్చి ఏడ్చి చనిపోయెను. ముని దంపతులు అతనికి బెట్టిన శాపము నిజము అయ్యెను.

క. హాకులవర్ధన! హా కరు
ణాకర! హా ధర్మలోల! హా గుణనిధి! హా
శ్రీకర! హా జయవర ల
క్ష్మీకర! హా రామ! యనుచు మేనుఁదొఱంగెన్.

అడవిలో రామలక్ష్మణులు ఆకులు కొమ్మలు తెచ్చి ఒకచిన్న పాక వేసికొనిరి. ఆపర్ణశాలయందే వారుముగ్గురును కాలము గడపుచుండిరి.

సీతారాములకు లక్ష్మణుఁడు సేవ చేయుచుండెను. ఒకనాఁడు రామలక్ష్మణులు ఇంట లేని సమయము చూచి,



రాక్షసులకు రాజయిన రావణుఁడు ఆపర్ణశాలకు వచ్చెను. అతఁడు సీతను లంకాపట్టణమునకు ఎత్తుకొని పోయెను.

పాపము ! సీత ఏమియు చేయలేక ఘూల్లున రోదనము చేసెను. ఆ రోదనము జటాయువను పక్షిరాజు వినెను.

వెంటనే జటాయువు మిక్కిలి కోపముతో ఎగిరివచ్చి రావణుని రథమును అడ్డగించెను. అప్పుడు రావణునకును జటాయువునకును పోరుజరిగెను. ఆ కలహములో జటాయువు తన వాడియైన ముక్కుతో రావణుని పొడిచెను. కాళ్ళతో తన్నెను. గోళ్ళతో రక్కెను. ఎన్ని చేసినను ప్రయోజనము లేకపోయెను. బలవంతుడైన రావణుఁడు కత్తితో ఆ పక్షిరాజును రెక్కలు నఱికి క్రింద పడవేసెను.

మాటలు:—వరము = కోరిక, పర్ణశాల=ఆకులతోకట్టినపాక, రోదనము= ఏడ్పు, కలహము=పోరు, ప్రయోజనము=లాభము, ఉపయోగము, బలవంతుఁడు = బలముకలవాఁడు.

ప్రశ్నలు:—కైక దశరథుని ఏమివరములు కోరెను? రాముఁడు అందుపై ఏమిచేసెను? కైక వరములను ఎప్పుడుకోరెను? దశరథునకు ఏమి శాపము ఉండెను? ఆ శాపము ఎట్లు నిజము ఆయెను? అతఁడు రాముని ఎట్లు తలఁచి చనిపోయెను? రామునివెంట అడవికి ఎవరు వెళ్ళిరి? వారు అడవిలో ఎక్కడ కాపురముచేసిరి? రావణుఁడు ఏమిమోసము చేసెను? జటాయువు అతనితో ఏలపోరెను? జటాయువు ఏమయ్యెను?

# 5. జటాయు మరణము.



మాయలేడి మృతినొందిన పిదప రామలక్ష్మణులు వారి ఆకుటింటికి మఱలిరి. వచ్చి చూచుసరికి పర్ణశాలలో సీతలేదు. ఆమె ఎచ్చటికి వెళ్ళినదో ఊహింపలేక పోయిరి. గృహము చుట్టుప్రక్క లంతట వెదకిరి. గట్టిగా పేరుపెట్టి జానకిని పిలిచిరి. కాని ఆమె జాడ పొడగట్టలేదు.

పాపము! వారికి దేహము అంతయు గడగడవణఁకెను. కన్నులనుండి నీరు కారెను. "సీతా! సీతా" అని పిలుచుచు రాముఁడు మిక్కిలి దుఃఖించుచుండెను.

ఉ. హాయను సీతసీతయను నక్కట! యెక్కడఁబోయితిందురా
వేయను నిల్వు నిల్వుమను నీగతిఁ జేరద నాముపల్కవిం
టేయను వేగ మో యనఁగదేయను నీశుభదర్శనంబు నీ
వేయనునన్నుఁబాయ జను నేయను నాదట జూడవేయనున్.

లక్ష్మణుఁడు ఎంత ఓదార్చినను వానికి దుఃఖము చల్లారలేదు. సీతకొఱకు ఆ వనమంతయు వెదకి వెదకి వారు విసిగిపోయిరి.

క్రమముగా రామునకు అధికవిచారముచేత మతి చెడి పోయినది. పిచ్చివానివలె సంచరించుచుండెను. 'అన్నయ్యా! సీతకొఱకు మీరు విచారించవద్దు. ఆమె ఎక్కడనో ఉండును.

మనము ఇంకను వెదకిన ఆమెను తప్పక కనుగొందుము' అని లక్ష్మణుడు సోదరునకు ధైర్యము చెప్పెను.

రాముడు:—లక్ష్మణా ! క్రూర మృగంబులు సీతను చంపి తినలేదుకదా !

లక్ష్మణుడు:—అన్నయ్యా ! అట్లు ఎన్నడును జరిగియుండదు. ఎట్టి క్రూరమృగమైనను సీతాదేవికి కీడుచేయదు.

రాముడు:—సీత మంచి చక్కనిది. అందుచే ఏదుష్టుడైన ఆమెను ఎత్తుకొని పోయెనేమో !



లక్ష్మణుడు:—అటే జరిగినచో మనము ఆ దుష్టుని సంహరించి సీతమ్మను క్షణములో తీసికొని రాగలము.

ఇట్లు మాట్లాడుచు వారు కొంత దూరము నడచిరి. అప్పుడు ఱెక్కలు తెగి పడియున్న జటాయువు వారికి కనఁబడెను. చచ్చుటకు సిద్ధముగానున్న ఆపక్షిరాజును రామలక్ష్మణులు పలుకరించిరి. లంకా పట్టణమునకు రాజు అయిన రావణుఁడు సీతను ఎత్తుకొని పోయినసంగతి చెప్పి జటాయువు ప్రాణము విడిచెను.

సీత వృత్తాంతము తెలిసికొని రామలక్ష్మణులు చాల విచారపడిరి. రావణునిపై వారికి చాల కోపము వచ్చెను. పండ్లు పటపటకొఱికిరి. కన్నులెఱ్ఱఁజేసిరి. ఇద్దరును ధనుస్సులు ఎక్కుపెట్టిరి. రావణుని ప్రాణములుతీసి సీతను తెచ్చుటకు నిశ్చయించిరి.

**మాటలు:**— మృతినొందుట = చచ్చుట, పర్ణశాల = ఆకులతోకట్టిన ఇల్లు, జానకి = సీత, చీరెదను = పిలిచెదను, సంచరించుచుండెను = తిరుగుచుండెను, దుష్టుఁడు = చెడ్డవాఁడు, పలుకరించిరి = మాట్లాడించిరి. వృత్తాంతము = సమాచారము.

**ప్రశ్నలు:**— సీతను గానక రాముఁడేమని విలపించెను? లక్ష్మణుఁడు వాని నెట్లు ఓదార్చ జూచెను? సీతకేమి సంభవించెనని రాముఁడూహించెను ? ఆయూహలకు లక్ష్మణుఁడేమి సమాధానము చెప్పెను ? జటాయువు రామునకేమి తెలియపఱచెను? అందుపై రామలక్ష్మణులేమి నిశ్చయించుకొనిరి ?

---

# 6. వాలి.



రావణుని దుండగము జటాయువు వలన తెలిసికొని వానిని కడతేర్చుటకు రామలక్ష్మణులు బయలుదేఱిరి.

అంతలో హనుమంతుఁడు వారికంటఁబడెను. అతఁడు ఒక చెట్టుపైనుండి దుమికి రామలక్ష్మణుల ముందు నిలిచి వారి వృత్తాంతము అడిగెను. లక్ష్మణుఁడు తనకథ అంతయు చెప్పి అతనిఁగూర్చి అడిగెను.

అప్పుడు హనుమంతుఁడు ఇట్లుచెప్పెను. "ఓరామా! ఓలక్ష్మణా! మారాజు సుగ్రీవుఁడు. నాపేరు హనుమంతుఁడు. సుగ్రీవుని అన్న వాలి. ఆవాలి మారాజు భార్యను అపహరించెను. మారాజును కిష్కింధనుండి గెంటివేసెను. వాలిని గెలువలేక సుగ్రీవుఁడు ఇప్పుడు ఋశ్యమూకమను కొండ మీఁద దుఃఖించుచున్నాఁడు. గొప్పవీరులవలెనున్న మిమ్ముఁజూచి మీరెవ్వరో తెలిసికొని గమ్మని నన్ను పంపినాఁడు. అతఁడు మీ స్నేహము ఆశించుచున్నాఁడు. మీరు మారాజునకు స్నేహితులగుట మంచిది. మీసాయముతో సుగ్రీవుఁడు వాలిని జంపి కిష్కింధను పాలింపఁగలఁడు. మారాజు సాయముతో మీరు రావణుని చంపి సీతను రక్షింపఁగలరు. ఐకమత్యము వలన ఎంతటి గొప్ప పనులయినను సులభముగా చేయవచ్చును గదా!"

హనుమంతుని మాటలు విని రాముఁడును, లక్ష్మణుఁడును చాల సంతోషించిరి. సుగ్రీవునితో స్నేహము చేయుటకు ఒప్పుకొనిరి. హనుమంతుఁడు రామలక్ష్మణులను సుగ్రీవుని కడకు తీసికొనిపోయెను. సుగ్రీవుఁడు రామలక్ష్మణులకు



మ్రొక్కి చాల గౌరవించెను. సుగ్రీవునకును రామలక్ష్మణులకును గాఢమగు స్నేహము కుదిరెను.

"వాలి గొప్ప బలవంతుఁడు. ఎదురుగా నిలిచి ఎంత గొప్ప వీరులయినను వానిని గెలువలేరు." అని సుగ్రీవుఁడు రామునితో చెప్పెను. "సుగ్రీవా! నీవు వాలిని యుద్ధమునకు పిలువుము. మీరిద్దఱును పోరాడుచుండఁగా నేను చాటుగా నుండి బాణములతో వాలిని కొట్టెదను" అని రాముఁడు బోధించెను. ఈ ఉపాయమునకు సుగ్రీవుఁడు చాల సంతసించెను.

యుద్ధమునకు వచ్చి వాలి సుగ్రీవునితో భయంకరముగఁ బోరాడుచుండెను. అప్పుడు రాముఁడు చెట్టుచాటున నక్కియుండెను. సమయముచూచి అతఁడు వాలిని బాణముతో కొట్టి చంపెను.

మాటలు:—దుండగము = చెడ్డతనము, అపహరించెను = దొంగిలించెను, ఆశించు = కోరు, గాఢమగు = ఎక్కువగు, బోధించెను = నచ్చజెప్పెను.

ప్రశ్నలు:—హనుమంతుఁడెవరు ? సుగ్రీవుఁడు రామలక్ష్మణుల స్నేహమును ఏల యాశించెను ? రామలక్ష్మణులు సుగ్రీవునితో స్నేహము ఏల చేసిరి ? వాలిని చంపుటకు రాముఁడు చెప్పిన ఉపాయమేమి ? వాలి ఎట్లు చచ్చెను ?

---

# 7. సీతాన్వేషణము.



వాలి చచ్చుటచేత సుగ్రీవునకు శత్రుభయము పోయి నది. ఒక శుభముహూర్తమున రాముఁడు వానికి పట్టాభిషేకము చేసెను. సుగ్రీవుఁడు వైభవముతో కిష్కింధను పాలించు చుండెను.

వాలికి అంగదుఁడు అను కొడుకు గలఁడు. పాపము! అతఁడు తండ్రి కొఱకు ఎంతో దుఃఖించెను. రాముఁడును సుగ్రీవుఁడును జాలిపడి వానిని ఓదార్చిరి. ఇంతవఱకు నున్న విరోధము విడిచి అంగదుఁడు సుగ్రీవుని యందు భక్తికలిగి యుండెను. కిష్కింధలోని వానరు లందఱును రామలక్ష్మణులయందును సుగ్రీవుని యందును వినయము విశ్వాసము కలిగియుండిరి.

రాముఁడు సుగ్రీవునకు చేయవలసిన యుపకారము జరిగెను. ఇంక సుగ్రీవుఁడు రామునకు చేయవలసిన ప్రత్యుపకార మున్నది. రావణుని చంపు ప్రయత్నములో సుగ్రీవుఁడు రామునకు తోడుపడవలసియున్నది. ఆ ప్రయత్నమునుగూర్చి రాముఁడు, లక్ష్మణుఁడు, సుగ్రీవుఁడు, అంగదుఁడు, హనుమంతుఁడు మొదలగు వారందఱును బాగుగ యోచించిరి. రావణుఁడు సీతను ఎక్కడ దాచెనో వారికి తెలియదు.

సీత ఉన్నచోటు తెలిసికొనుటకు ప్రపంచము అంతయు వెదకించవలెనని రాముఁడు చెప్పెను.

అప్పుడు సుగ్రీవుఁడు వీరులగు వానరులతో వినతుని తూర్పునకు పంపెను. వానితో నూఱువేల వానరులు బయలుదేఱిరి. హనుమంతుని దక్షిణ దిక్కునకు పంపెను. వానితో అంగదుఁడు, జాంబవంతుఁడు, నీలుఁడు మొదలగు గొప్పవీరులు అనేకులు బయలుదేఱిరి. రెండులక్షల వానరులతో సుషేణుని పశ్చిమమునకును వేయికోట్ల వానరులతో శతబలిని ఉత్తరమునకును బంపెను.

బుద్ధి, బలము, పట్టుదల వీటియందు హనుమంతుఁడు వానరులందఱిలోను గొప్పవాఁడు. అందుచేత అతఁడు సీత ఎచ్చటనున్నదో చూచిరాఁగలడని రాముఁడు నమ్మెను. ఆ నమ్మకముతో అతఁడు సీతకు ఆనవాలు చూపుటకు తన వ్రేలి ఉంగరమును వానిచేతికిచ్చెను. హనుమంతుఁడు దానిని పుచ్చుకొని కన్నులకు అద్దుకొనెను. శ్రీరామునకును సుగ్రీవునకును నమస్కరించి హనుమంతుఁడు బయలుదేఱెను.

సీతను వెదకుటకు వెళ్ళిన వారిలో ఒక్క హనుమంతుఁడు తప్ప తక్కినవారందఱు నెలదినములలో తిరిగి వచ్చిరి. వచ్చి సీత కనఁబడలేదని తమప్రభువకు విచారముతో చెప్పిరి. అంగదుఁడు మొదలగువారితో హనుమంతుఁడు దక్షిణ సముద్రముకడకు వచ్చెను. ఆ సముద్రము దాఁటిన లంక కనబడును. ఆలంకయే రావణుని రాజధాని. సముద్రమును

చూచి వానరులు భయపడిరి. హనుమంతుఁడు మాత్రము ధైర్యముతో సముద్రమును చంగున దాఁటెను.

చ. మొగముబిగించిపాదములుమొత్తముగానటనూదిత్రొక్కినీ
టుగ మొగమెత్తి భీకరకఠోర రవంబుననార్చి బాహు ల
త్యగణితలీలఁజూచి వలయంబుగ వాలముద్రిప్పి వేగనన్
నగమునగమ్ముగ్రుంగఁ గపినాథుఁడు నింగికిదాఁటెఁజువ్వనన్.

సముద్రము దాటి హనుమంతుఁడు లంకలో చొరఁబడెను. రావణుఁడు సీతను ఎచ్చట దాచెనో కనుగొనుటకు అంతటను వెదకెను; వెదకుచుండఁగా ఒక వనములో చెట్టు క్రింద మిగుల చక్కని స్త్రీ కనుపించెను. ఆమె ఏడ్చుచు ఒకచోట కూర్చుండి యుండెను. ఆమెయే సీతాదేవి యని హనుమంతుఁడు నిశ్చయించుకొనెను.

మాటలు:—శత్రువు = విరోధి, శుభముహూర్తమున = మంచి సమయమున, ప్రత్యుపకారము = మేలునకు బదులుగా మేలు, వానరులు = కోఁతి రూపుకలవారు, పశ్చిమము = పడమర, ఏలిక = రాజు, మొత్తముగ = ఒక్కసారిగ, ఊది = పూని, కఠోర = కఠినమైన, రవము = శబ్దము, ఆర్చి = కేక వేసి, బాహులు = భుజములు, అత్యగణితలీల = మిక్కిలి అధికమైనరీతిని, వలయంబుగ = గుండ్రముగ, వాలము = తోఁక, నగము = పర్వతము, కపినాథుఁడు = కోతులకు అధిపతి, (హనుమంతుఁడు), నింగికి = ఆకాశమునకు.

ప్రశ్నలు:—రాముఁడు సుగ్రీవునకు చేసిన ఉపకారమేమి? సుగ్రీవుఁడు రామునకు చేయవలసియున్న ఉపకారమేమి? సీతను వెదకుటకు ఏయేదిశలకు ఎవరెవరిని సుగ్రీవుఁడు పంపెను? వీరిలో సముద్రముదాఁటినవా రెవరు?

# 8. సేతుబంధనము.

సీతను చూచు భాగ్యము కలిగినందులకు హనుమంతుఁడు చాల సంతసించెను. కాని ఆమె అవస్థ చూచి కన్నీరు కార్చెను.

హనుమంతుఁడు చూచినప్పుడు సీతచుట్టును కొందఱు రాక్షసస్త్రీలు కాపుండిరి. "మా రావణుని పెండ్లాడకున్న నిన్ను చంపివేసెదము" అని వారు కత్తులెత్తి పాపము సీతను భయపెట్టుచుండిరి. అది చూచి హనుమంతుఁడు సహించలేకపోయెను. కొంతసేపునకు రాక్షసస్త్రీలు కల్లు త్రాగి మత్తుచే నిద్రించిరి. అప్పుడు అతఁడు సీత ఎదుట నిలిచి ఆమెకు నమస్కారము చేసి తన వృత్తాంతము చెప్పెను. కాని రాక్షసుఁడే మాఱురూపమున వచ్చెనని తలఁచి సీత మొదట వానిని నమ్మలేదు. అంత అతఁడు రాముని ఉంగరము ఆమెకు ఆనవాలుగా ఇచ్చెను. ఆమె ఆ ఉంగరమును కన్నులకద్దుకొని సంతోషించెను. తన కష్టములన్నియు రామునితో వివరముగ చెప్పుమని హనుమంతుని కోరెను. మఱియు రామునకు ఆనవాలుగా తన తలయందున్న ఒక మణిని ఇచ్చెను.

హనుమంతుఁడు ఆ మణిని అందుకొని సీతకు ధైర్యము చెప్పి బయలుదేఱెను. తన రాక రావణునకు తెలియచేయు

టకు లంకంతయు తగులబెట్టెను. పిమ్మట సముద్రము దాటి అంగదుఁడు మొదలగు వారితో రామునికడకు పోయెను. సీతను చూచిన శుభవార్త రామునకుఁ జెప్పెను. రాముఁడు, లక్ష్మణుఁడు మొదలగువారు ఎంతో సంతోషించి హనుమంతుని చాల మెచ్చుకొనిరి.

లంకమీఁద దండెత్తుటకు సేనలు సిద్ధము చేసిరి. అందఱును ఉత్సాహముతో లంకకు బయలుదేఱిరి. వారు



సముద్రమును దాఁటుటకు దాని మీఁద ఒక పెద్ద వంతెన కట్టుటకు నిశ్చయించిరి. ఆ వంతెన కట్టుటకు ఒక్కొక్క వానరుఁడు ఒక్కొక్క పర్వతము చొప్పున మోసికొనివచ్చి సముద్రమున పడవేయుచుండిరి.

ఆ వంతెన కట్టుటలో నీలుఁడు అను వానరుఁడు చాల సాయము చేసెను. చిన్నప్పుడు నీలుఁడు యింటిలోని వస్తువులు తీసికొనిపోయి చెఱువులోనో, నూఁతిలోనో పాఱవేయుచుండెడి వాఁడఁట. వాని తండ్రి వాని బాధ భరించలేక, "నీలుఁడు నీటిలో ఏవస్తువు పడవేసినను మునుఁగక తేలిపోవునుగాక!" అని పలికెను. అప్పటినుండి తండ్రి వరమువలన నీలుఁడు పడవేసినది నీటిపై తేలుచుండెను. తండ్రి వెళ్ళి ఆవస్తువులను తెచ్చుకొనుచుండెను. వానరులు తెచ్చిన కొండలు నీలుఁడు అందుకొని సముద్రముపై పడవేయుచుండెను. ఆకొండలు మునిఁగిపోక సముద్రము పొడుగున మంచివంతెనగ ఏర్పడెను. ఆవంతెనపై నుండి రాముఁడు వానర సేనలతో సముద్రమును దాఁటెను.

**మాటలు:**—వివరముగ = స్పష్టముగా, శుభవార్త = మంచికబురు, ఉత్సాహము = సంతోషము, భరించలేక = సహించలేక.

**ప్రశ్నలు:**—హనుమంతుని చూచి సీత మొదట యేమని తలఁచెను? ఆమె అనుమానము ఎట్లు తీరెను? సీత హనుమంతునితో ఏమని చెప్పెను? హనుమంతుఁడు చూచినప్పుడు సీత అవస్థ ఎట్లుండెను? నీలుఁడు వంతెన ఎట్లు కట్టెను?



# 9. విభీషణుఁడు.

కోట్లకొలఁదిగనున్న వానరులతో రాముఁడు సముద్రమును దాఁటెను. వారు లంకను నాలుగు దిశలనుండి ముట్టడించిరి. విభునిరాక విని సీతాదేవి సంతోషించెను. రావణుఁడు ఆగ్రహముచే మండిపడుచుండెను. వానరులతో యుద్ధముచేయుటకు రావణుఁడు శీఘ్రముగ రాక్షససేనలను పంపెను.

రావణునకు విభీషణుఁడను తమ్ముఁడు కలఁడు. ఆ విభీషణుఁడు అన్నవంటి క్రూరుఁడుకాఁడు. అతఁడు చాల మంచివాఁడు. బుద్ధిమంతుఁడు అందఱియొడను దయ గలవాఁడు. రాక్షసులలో విభీషణుఁడు ఉత్తముఁడు.

రావణుఁడు సీతాదేవిని ఎత్తుకొనివచ్చుట విభీషణునకు ఇష్టములేదు. విభీషణుఁడు తన సోదరునకు హితవుచెప్పెను. "ఓఅన్నా! రావణా! శ్రీరాముఁడు భగవంతుఁడు. ఆతని భార్య సీత మహాలక్ష్మి నీవు వారికి అపకారము చేసితివి. చేసినది తప్పు అని ఒప్పుకొని వెంటనే సీతను శ్రీరామునకు సమర్పింపుము. ఆ భగవంతుఁడు నిన్ను క్షమించి దయతో రక్షింపగలఁడు. అట్లు చేయనిచో రామలక్ష్మణులు నిన్నును నీసైన్యమును నీలంకను క్షణములో నాశనము చేసెదరు. నామాట వినుము. ఊరక చెడిపోకుము.

గీ. ఆదిమధ్యాంత రహితుఁడైనట్టి విష్ణు
డసురకుల వధార్థంబిట్లు లవతరించె
రవికులాంబుధిసోముఁడై రామచంద్రుఁ
డురుబలుఁడుగాని సామాన్య నరుఁడుగాఁడు.

గీ. సురవరుఁడు గాఁడు కిన్నరేశ్వరుఁడు గాఁడు
పావకుఁడు గాఁడు పితృలోకపతియుఁగాఁడు
ఆహవక్రీడ నేకోడ నాదివిష్ణుఁ
డైన రాముని గెల్వ నీ కలవియగునె?"

అని చాలవఱకు బోధించెను. అప్పుడు రావణునకు విభీషణునిపై మిక్కిలి కోపము వచ్చెను. ఒక లెఱుఁగక అతఁడు వానిని యింటినుండి గెంటించెను.

పాపము! విభీషణుఁడు ఏమియుచేయలేక పోయెను. "రామా! రక్షింపుము! రక్షింపుము!" అని వేఁడుకొనుచు శ్రీరామునికడకువచ్చి వానిపాదములపైఁబ్రాలెను. రాముఁడు వానిని లేవనెత్తి అభయమిచ్చెను. "విభీషణా! భయపడకుము. దురాత్ముఁడైన మీఅన్నను సంహరించి నిన్ను లంకకు రాజుగా జేసెదను" అని దయతో పలికెను. విభీషణుఁడు శ్రీరాముని నమ్మి కొలుచుచుండెను.

మాటలు:—విభుఁడు = భర్త, ఆగ్రహము = కోపము, శీఘ్రముగ = త్వరగా, ఉత్తముఁడు = మిక్కిలి మంచివాఁడు. హితవు = మంచి, అపకారము = కీడు, సమర్పించుము = ఇమ్ము, నాశనము = పాడు,

ఆదిమధ్యాంతరహితుఁడు = మొదలు, నడుము, తుదిలేనివాడు, అసుర కులము = రాక్షసవంశము, వధార్థము = చంపుటకొఱకు, ఉరు = మిక్కిలి, ఆహవక్రీడ = యుద్ధము.

ప్రశ్నలు:—విభీషణుని రావణుఁడేల ఇల్లు వెడలఁగొట్టెను ? విభీషణుఁడు రావణునకు ఏమి హితవు చెప్పెను? విభీషణుఁడు ఎవరిని శరణు జొచ్చెను ? విభీషణునకు రాముఁడేమని వాగ్దానము చేసెను ?

---

# 10. రావణవధ.



వానరులును రాక్షసులును భయంకరముగా యుద్ధము చేసిరి. ఆ యుద్ధములో ఎందఱో రాక్షసులు నేలఁగూలిరి. రాక్షససేనానాయకులు అందఱు చనిపోవుటచేత రావణుఁడు తానే యుద్ధమునకు వచ్చెను.

రామ రావణులకు ఘోరసంగ్రామము జరిగెను. రావణునకు పది తలలు గలవు. రాముఁడు ఆ పది తలలను ఎన్నోమాఱులు తన బాణములతో తెగఁగొట్టెను. కాని ఆ తలలు మఱల ఎప్పటియట్లె మొలచుచుండెడివి. ఆవింత చూచి రాముఁడు ఆశ్చర్యమును పొందెను. రాముఁడు భయముచేత తెల్లపోవుచుండుట విభీషణుఁడు చూచెను.

"ఓదేవా ! ఈ రావణుఁడు దేవతలను గెలిచి వారి అమృతభాండము తెచ్చి తనకడుపులో పెట్టుకొనెను. ఆకుండ కడుపులో ఉన్నంతవఱకు వానితలలు ఇట్లు మొలచుచునే

ఉండును. కాబట్టి నీబాణముతో మొదట ఆ కుండను పగులగొట్టుము" అని విభీషణుఁడు రహస్యమును తెలియ జెప్పెను. విభీషణుఁడు చెప్పిన ఉపాయమునకు రాముఁడు చాల సంతోషించి వానిని ఎంతో మెచ్చుకొనెను.

విభీషణుఁడు చెప్పినట్లుగ, రావణుని కంఠములకు గురిపెట్టుటమాని అతని కడుపునకు, గురిచూచి రాముఁడు బాణములు విడిచెను. అవి అదృశ్యమైపోయి వాని కడుపుచీల్చి



లోపలనున్న అమృతభాండమును ముక్కముక్కలుగా పగుల గొట్టెను. అందుకు రావణుఁడు భయపడి విచారించుచుండగా శ్రీరాముఁడు తటాలున వాని తలలు మఱల తెగఁగొట్టెను.

వెంటనే పెద్దకొండవలె దశకంఠుఁడు నేలపై బడి ప్రాణములు విడిచెను.

ఇట్లు దుష్టులగు రాక్షసుల నందఱిని సంహరించి శ్రీరాముఁడు సీతను కలిసికొని ఆనందించెను. విభీషణునకు లంకారాజ్యమును ఇచ్చెను. రామలక్ష్మణులు సుగ్రీవాదులను



కొనియాడిరి. వారితో రాముఁడు విమానముపై అయోధ్యకేగెను. వారి రాకకు జనులు ఎల్లరు మిగుల సంతసించిరి.

కొన్నాళ్ళకు సీతారాములకు పట్టాభిషేకము జరిగెను. శ్రీరాముఁడు తమ్ములసాయముతో రాష్ట్రములోని ప్రజల

కొట్టి కష్టమురాకుండ చిరకాలము రాజ్యముచేసెను. శ్రీరామ రాజ్యము ఎల్లరకు సుఖకరమై ఒప్పెను.

మాటలు:— నేలగూలిరి = చచ్చిరి, ఘోరసంగ్రామము=గొప్పయుద్ధము, భాండము=కుండ, దశకంఠుఁడు=పదితలలుగలవాఁడు (రావణుడు) రాష్ట్రము = దేశము, సుఖకరము = సుఖమును కలిగించునది, చిరకాలము = చాలకాలము.

ప్రశ్నలు:— విభీషణుఁడు రామునకు చెప్పిన రహస్యమేమి? రాముఁడు రావణుని ఎట్లు చంపగలిగెను? రావణుని చంపిన తరువాత శ్రీరాముఁడు ఏమిచేసెను? శ్రీరాముని పాలనము ఎట్లుండెను?

---

# 11. రా జ సూ య ము .

పూర్వము ధృతరాష్ట్రుఁడు పాండురాజు అను ఇద్దఱు అన్నదమ్ములు కలరు. పెద్దవాఁడు అయిన ధృతరాష్ట్రుఁడు గ్రుడ్డివాఁడు. వానికి నూఱుగురు కొడుకులు కలిగిరి. ఆ నూఱుగురిలో దుర్యోధనుఁడు పెద్దవాఁడు. రెండవ వాఁడు దుశ్శాసనుఁడు. పాండురాజునకు అయిదుగురు కొడుకులు కలరు. వారిలో ధర్మరాజు పెద్దవాఁడు. ధృతరాష్ట్రుని నూఱుగురుతనయులకు కౌరవులనిపేరు. ధర్మరాజు మొదలగు ఏవురు పాండుసూనులకు పాండవులని పేరు. ధర్మరాజు తమ్ములు భీమార్జున నకుల సహదేవులు.

ధృతరాష్ట్రుఁడు గ్రుడ్డివాఁడు అగుటచేత పాండురాజే రాజ్యభారము వహించెను. రాజ్యమును వృద్ధిచేసి కొంతకాలమునకు చనిపోయెను. మృతి నొందిన తండ్రికి స్వర్గము ప్రాప్తించుటకు పాండవులు రాజసూయము అను యజ్ఞము చేయుట తలపెట్టిరి. లోకములోని రాజులను అందఱిని గెలిచి వారివలన వచ్చు ధనముతో ఈ యజ్ఞము చేయవలయును.



తన నలుగురు తమ్ములును గొప్ప వీరులు అని తెలిసియే ధర్మరాజు రాజసూయము చేయఁ దలఁచెను. ఈ ప్రయత్నమున వారికి భగవంతుఁడైన శ్రీకృష్ణుఁడు తోడుపడెను.

ఆ కాలమున జరాసంధుఁడు అను గొప్ప రాక్షసుఁడు కలఁడు. వాఁడు మగధదేశమునకు రాజు. మిక్కిలి క్రూరుఁడై ప్రజలను పీడించుచుండెను. రాజకుమారులను ఎందఱినో పట్టితెచ్చి అమ్మవారికి బలియిచ్చుచుండెను. ఎందఱురాజులో యత్నించిరి. కాని ఎవ్వరును వానిని గెలువలేక పోయిరి. జరాసంధుని పేరు చెప్పిన ఎంతగొప్ప శూరుఁడు అయినను భయపడుచుండెను అట్టి జరాసంధుని చంపుటకు భీముఁడును అర్జునుఁడును పయనమైరి. శ్రీకృష్ణుఁడు వారికి సాయపడెను వీరు ముగ్గురును మగధ దేశమునకు పోయి జరాసంధుని యుద్ధమునకుఁ బిలచిరి. వారి ముగ్గురిలో అతనికి ఇష్టమైన ఒక్కనితో యుద్ధము చేయవచ్చునని చెప్పిరి.

ఆ. వె. అధిక బాహుబలులమైన మా మువ్వుర
యందు నొక్కరుని మహాబలాఢ్యు
గోరికొనుము వాఁడు ఘోరంబుగా నిన్ను
మొనసి మల్లయుద్ధమున జయించు.

అప్పుడు జరాసంధుఁడు మిక్కిలి బలవంతుఁడైన భీముని యెంచుకొనెను. భీమజరాసంధు లిద్దఱు కొన్ని రోజులు భయంకరముగా యుద్ధము చేసిరి. కడకు భీమునిచే జరాసంధుఁడు చచ్చెను.

పిమ్మట భీమార్జునులు మఱి కొందఱు రాజులను జయించిరి. ధర్మరాజునకు కవలతమ్ములయిన నకులుఁడును

సహదేవుఁడును గూడ ఎందఱో రాజులను ఓడించిరి. ఇట్లు భీమార్జున నకులసహదేవులు రాజులను అందఱిని లోఁబఱచుకొని పెక్కుధనములను తెచ్చిరి. ఆ ద్రవ్యముతో ధర్మరాజు రాజసూయయాగమును చేసెను.

ఆ యజ్ఞమును చూచుటకు లోకములోని రాజులందఱును వచ్చిరి. మయుఁడనువాఁడు మిక్కిలి చిత్రమయిన ఒక సభ చేసి ధర్మరాజునకు ఇచ్చెను. వచ్చిన రాజులందఱును ఆసభను ఎంతో వింతగా చూచి ఆశ్చర్యపడిరి. ఆమయసభలో నీరులేనిచోట నీరు వున్నట్లుగాను నీరువున్నచోట నీరు లేనట్లుగాను కనఁబడుచుండును. తలుపు ద్వారము లేని గోడలకు తలుపు ద్వారము ఉన్నట్లు కనఁబడును. అవి ఉన్నచోట లేనట్లుగా కనఁబడును. ఇది ఆసభయందలి చిత్రము.

దుర్యోధనునకు ఆసభలో చాల అవమానము జరిగెను. నీరులేనిచోట నీరుఉన్నది, అనుకొని అతఁడు తన కట్టినబట్ట ఎగఁగట్టుకొనుచుండెను. నీరు ఉన్నచోట అది లేదనుకొని నడచుటచే వాని బట్టలు తడిసిపోవుచుండెను. ద్వారముగల చోట లేదనుకొనుటచే పాపము వానితలకు దెబ్బలుతగిలెను. దుర్యోధనుని అవస్థచూచి పాండవులును వారి భార్యయైన ద్రౌపదియు నవ్విరి. వారు పరిహసించిరని దుర్యోధనుఁడు చిన్నపోయెను.

మాటలు:—తనయులు = కొడుకులు, సూనులు = కొడుకులు, వహించెను = మోసెను, మృతి = చావు, ప్రాప్తించు = దొరకు, వయనమయిరి = బయలు దేఱిరి, మహాబలాఢ్యుఁడు = గొప్పబలము కలవాఁడు, మొనసి = పూని, ద్రవ్యము = ధనము, పరిహాసించు = వేళాకోళము చేయు.

ప్రశ్నలు:—కౌరవులు ఎవరు? పాండవులు ఎవరు? ధర్మరాజు రాజసూయమును ఏల తలపెట్టెను? ఆయాగమును ఎట్లు చేయవలెను? జరాసంధుఁ డెవరు? అతనిని ఎవరు గెలిచిరి? మయసభలోని చిత్రమేమి? దుర్యోధనుని చూచి పాండవులు ఏల నవ్విరి?

---

# 12. నలచరిత్ర.

## మొదటి భాగము.



నలుఁడు నిషధయను రాజ్యమును పాలించుచుండెను. చక్కఁదనము, సద్గుణము, ధర్మబుద్ధియందు ఏ రాజును నలునకు సాటిరాడు.

నలుని గొప్పతనమును విని, విదర్భరాజు కూఁతురు దమయంతి వానిని వరించెను. రూపమునందును గుణములయందు దమయంతికి నలుఁడే తగినవాఁడని అందఱు వారిని పొగడుచుండిరి. దమయంతి నలుని వరించిన సంగతి ఆమె తండ్రి భీమరాజునకుఁ దెలిసెను. అతఁడు స్వయంవరమును

చాటించెను. ఆ స్వయంవరమునకు దేశ దేశముల నుండి రాజులు వచ్చిరి. ఇంద్రాది దేవతలు కూడ విచ్చేసిరి. వారు అందఱును చూచుచుండ దమయంతి నలునికంఠమునఁ బూల దండ వేసెను. అంతట నలదమయంతులకుఁ బరిణయము జరిగెను.



కలి అనువాఁడు దమయంతిని పెండ్లాడ వలయునని అనుకొనుచుండెను. నలదమయంతులకు వివాహమైన సంగతి విని అతఁడు మిక్కిలి కోపించెను. వారి రాజ్యము పోఁగొట్టి వారిని అడవులకు పంపి నానా కష్టముల పెట్టెదనని ప్రతిజ్ఞ జేసెను.

కలి నలుని యందు ప్రవేశించుటచేత, నలుఁడు పుష్కరుఁడను రాజుతో జూదమాడుటకు మొదలు పెట్టెను. ఆ జూదమునందు నలుఁడు పుష్కరునకు రాజ్యమంతయు ఓడిపోయెను.




క. కలధనములెల్ల నోడ్డుచు
నలయక జూదమున విజితుఁడగుచుండె నిజా

ప్తులు వారించిన నుడుగక
నలుఁడు గలి ప్రేరణంబునను హతమతియై.

పాపము! నల దమయంతులు కట్టుబట్టలతో అడవులకు పోవలసివచ్చెను. నిలుచుటకు వారికి ఎక్కడను నీడలేక పోయెను. అడవులలో కాయలు, ఆకులు తిని ఆఁకలి దీర్చుకొనుచు వారు కొన్ని దినములు గడిపిరి. ఎన్నఁడును కష్టము తెలుగని దమయంతి అనేకకష్టములు పడవలసి వచ్చెను. ఆ కష్టములు నలుఁడు చూడలేక ఆమె నిద్రించు చుండఁగా ఆమెను విడిచిపోయెను.

మాటలు:—చరిత్ర=కథ, ధర్మబుద్ధి=మంచిబుద్ధి, వరించెను=పెండ్లాఁడ గోరెను, స్వయంవరము = భర్తను స్వయముగా ఎన్నుకొనుట, ఇంద్రాది దేవతలు = ఇంద్రుఁడు మొదలగు దేవతలు, పరిణయము= వివాహము, కలధనములు=ఉన్నసొమ్ములు, అలయక = విసుఁగుఁ జెందక, విజితుఁడు=ఓడిపోయినవాఁడు, నిజాప్తులు = తనస్నేహితులు, వారించినను=అడ్డుపెట్టినను, ఉడుగక=మానక, హతమతియై=బుద్ధిలేనివాఁడై, ప్రేరణమున=ప్రోత్సాహమువలన.

ప్రశ్నలు:—నలుఁడు ఎట్టివాఁడు? దమయంతి ఎట్టిది? ఆమె నలుని ఏల వరించెను? వారికి వివాహము ఎట్లు జరిగెను? నలునియెడల కలికి ఏల కోపము వచ్చెను? కలి ఏమని ప్రతిజ్ఞ చేసెను? కలి నలుని యందు ప్రవేశించి ఏమిచేసెను? జూదమువలన నల దమయంతులకు ఎట్టి కష్టములు వచ్చెను? నలుఁడు తన భార్యను ఏల విడిచి వెళ్ళెను?

---

# 13. నలచరిత్ర.

(రెండవ భాగము.)



పాపము! దమయంతి నిద్రనుండి లేచి భర్తను గానక వెదకి వెదకి, పిలిచి పిలిచి, కడకు గొల్లున యేడువసాగెను. ఇట్లు దుఃఖించుచు అడవులలో తిరిగి తిరిగి కొందఱు బాటసారులతో కలిసి వారి సాయమున దమయంతి తన పినతల్లి యిల్లు చేరుకొనెను. అక్కడ కొన్ని దినము లుండిన పిమ్మట పుట్టినింటికి పోయెను. ఆమె పడిన కష్టములన్నియు విని భీమరాజు మిక్కిలి దుఃఖించెను. నలుని వెదకుటకు కొందఱు బ్రాహ్మణులను నాల్గువైపులకుఁ బంపెను.

భార్యను విడిచి నలుఁడు పోవుచుండఁగా కర్కోటకుఁడను పాము వానిని కఱచెను. ఆపాము కాటువలన వాని శరీరము నల్లగా మాఱిపోయెను. చేతులు కుఱుచలయినవి. పాపము వాని చక్కదన మంతయు పోయి రూపు చెడిపోయినది. ఇట్లు కురూపియైన నలుఁడు బాహుకుఁడను పేరు పెట్టుకొనెను. ఋతుపర్ణుఁడను రాజుకడకుఁ బోయి వానికి వంటలవాఁడుగా కుదిరెను.

నలుని వెదకుచున్న బ్రాహ్మణు లన్నిదేశములు తిరిగి ఋతుపర్ణునికడకు వచ్చిరి. అచ్చట బాహుకునితో మాటాడి అతఁడు నలుఁడా యని అనుమానించి భీమరాజుతోఁ జెప్పిరి.

నలుని రప్పించుటకు భీమరాజు ఒక ఉపాయము ఆలో చించెను. "దమయంతి రెండవ స్వయంవరము" అని అతఁడు ఋతుపర్ణునకు కబురుపంపెను.



ఆవార్తవిని ఋతుపర్ణుఁడు ఆశ్చర్యపడెను. బాహుకుని దుఃఖమునకు మేరలేదు. దమయంతి రెండవ స్వయంవరమునకు ఋతుపర్ణుఁడు వెళ్లుటకు నిశ్చయించెను కాని అచ్చటకు విదర్భ వందలకొలఁది మైళ్ళదూరములో నున్నది.

మఱునాఁడే స్వయంవరమగుటచేత అతఁడు విదర్భకు ఒక దినములోఁ బోవలసి వచ్చెను. అంత వేగిరముగా రథము తోలఁగల నేర్పు ఒక్క బాహుకునకు తప్ప మఱెవ్వరికిని లేదని రాజునకుఁ దెలిసెను ఋతుపర్ణుని సెలవుపై బాహుకుఁడు రథముఁదోలెను. ఋతుపర్ణుఁడు విదర్భకు వచ్చెను.

రథము తోలుటలో ఆ నేర్పు నలునకు తప్ప మఱెవ్వరికిని లేదు. కావున బాహుకుఁడు నలుఁడేయని దమయంతియు భీమరాజును పోల్చగలిగిరి. అంతేగాక దమయంతి తనకొడుకును కూఁతును బాహుకుని యొద్దకు పంపఁగా అతఁడు వారిని చూచి దుఃఖింపసాఁగెను. అందువలన అతఁడు నలుఁడే యని దృఢముగ తెలిసికొని దమయంతి వాని పాదముల మీఁద వ్రాలెను. "నీవే నాపతివి. నీవేనలుఁడవు. నన్నురక్షింపుము" అని ఏడ్వసాఁగెను.

కర్కోటకుని విషమును నలునియందున్న కలి ఓర్వలేక పోయెను. నలుని దేహమునుండి అతఁడు వెలుపలికి వచ్చెను. "ఓనలరాజా! నిన్ను నానాకష్టములు పెట్టితిని. ఇంక నీభార్యతోను పిల్లలతోను సుఖముగా నుండుము" అని కలిచెప్పుచు నలునిరాజ్యమును మఱల వానికిప్పించెను.

మాటలు:—బాటసారులు = త్రోవను పోయెడివారు, కుఱుచలు = పొట్టి.
కురూపియైన = చెడ్డరూపముగల, దృఢముగ = నిశ్చయముగ,
పతి=భర్త.

ప్రశ్నలు:—దమయంతిని విడిచిన పిమ్మట నలుఁడెచ్చటకు వెళ్ళెను? వానికి మాఱు రూపము ఎట్లువచ్చెను ? దమయంతి తనపుట్టిల్లు ఎట్లు చేరు కొనెను ? నలుని వెదకుటకు భీమరాజు యేమిచేసెను ? నలుని రప్పించుటకు భీమరాజు చేసిన ఉపాయమేమి ? కురూపియైన నలుని, భీమరాజు దమయంతి ఎట్లుగుర్తించిరి ? కలి నలుని ఏల విడిచిపెట్టెను ? కలి తనను నలునకు ఏమి మేలు చేసెను ?

---

# 14. ఉత్తర గోగ్రహణము.

(మొదటి భాగము.)

మయసభలో దుర్యోధనునకు గొప్ప అవమానము జరిగెను. తనకు అట్టి పరాభవము చేసిన పాండవులపై పగ తీర్చుకొనవలెనని దుర్యోధనుఁడు తలచెను.

పాండవులను తన యింటికి పిలిపించి వారితో దుర్యోధనుఁడు జూదమాడెను. ఓడిపోయినవాఁడు పండ్రెండు సంవత్సరములు అరణ్యవాసము, ఒక సంవత్సరము అజ్ఞాత వాసము చేయునట్లు ఏర్పాటు చేసికొనిరి. అజ్ఞాతవాసములో బయలుపడినయెడల మఱల అరణ్యవాసము అజ్ఞాతవాసము చేయవలెనని దుర్యోధనుఁ డనెను. దుర్యోధనుఁడు చేసిన ఈనియమమునకు అంగీకరించి ధర్మరాజు జూదమాడెను.

ఆ మాయజూదములో అతఁడు నలునివలె తనరాజ్యమంతయు ఓడిపోయెను.

నియమము ప్రకారము పాండవులు పండ్రెండేండ్లు వనవాసము చేసిరి. ఇతరుల కంటఁ బడకుండ వారొకయేఁడు అజ్ఞాతవాసము జరుపవలసియుండెను. వారు మాఱువేషముల తోడను, మాఱుపేరుల తోడను, విరటుఁడను రాజుకడ చేరుకొనిరి. ఒక్కొక్కరు ఒక్కొక్క వృత్తియందు జీవించుచుండిరి. వారు పాండవులని విరటునకుఁ గాని, మఱెవ్వరికిఁ గాని తెలియదు. దుర్యోధనుఁడు మాత్రము పాండవులను బయలుపెట్టుటకు ఎన్నో ప్రయత్నములు చేయుచుండెను. పాండవులు ఎక్కడనుందురో గుర్తించుటకు అతఁడు దేశ మంతయు వెదకించెను. కడకు వారు విరటునికడ ఉన్నట్లు దుర్యోధనునకు అనుమానము కలిగెను.

దక్షిణ దిక్కునను ఉత్తర దిక్కునను మేయుచుండిన విరటుని ఆవులమందలను దుర్యోధనుఁడు హరించెను. అందు వలన విరటుఁడు తనతో యుద్ధమునకు వచ్చుననియు పాండవులు ఉన్నయెడల వారు కూడ అతనికి తోడువచ్చెద రనియు, అప్పుడు వారిని వెల్లడింపవచ్చుననియు దుర్యోధనుని ఉద్దేశము. అతఁడు అనుకొనినట్లే విరటుఁడు తనకుఁ గల అన్నిసైన్యములతో దక్షిణదిక్కునకు గోవుల విడిపించుటకు బయలుదేఱెను. తరువాత ఉత్తర దిక్కున నున్న విరటుని

గోవులను దుర్యోధనుఁడు హరించెను. ఆ దిక్కునకు పోయి గోవుల రక్షించుటకు మఱి సైన్యములు లేవు. యుద్ధము చేయుటకు వీరులు కూడ లేరు.

విరటరాజునకు ఉత్తరుఁడను కొడుకును, ఉత్తరయను కూఁతురును కలరు. ప్రజ్ఞలుపలుకుటలో ఉత్తరుఁడు గొప్ప వాఁడు. అంతటి పిఱికి మఱియొకఁడు ఉండఁడు. నాకంటె గొప్పవీరుఁడు లేఁడు. నేను కౌరవులను జయించి గోవులను విడిపించెదను. నాకు తగిన సారథిమాత్రము దొరకవలయును.

క. తగు సారథి దొరకొనినం
బగతుర భంజించు టెంతపని కదపుల ద
వ్వుఁగ గానిపోదురొకో యి
ట్లగు నే కలఁడేని సూతునరయుండెంకున్."

అని ఉత్తరుఁడు స్త్రీల యెదుట డంబములు పలుక సాఁగెను. పాపము వారు నిజమే అనుకొని సారథికై వెదకు చుండిరి.

మాటలు — ఉత్తరగోగ్రహణము=ఉత్తరదిశయందలి ఆవులనుపట్టుకొనుట, పరాభవము = అవమానము, అరణ్యావాసము = అడవిలోనుండుట, అజ్ఞాతవాసము=ఎవరికిని తెలియకుండ రహస్యముగ నుండుట, అంగీకరించి=ఒప్పుకొని, హరించెను=దొంగిలించెను, తోడు=సాయము. ప్రజ్ఞ=నేర్పు, సారథి=రథముతోలువాఁడు, పగతురు=శత్రువులు, భంజించు=ఓడించు, కదుపులు=ఆవులు, దవ్వు=దూరము, సూతుఁడు=సారథి, అరయుట=చూచుట, డంబములు = చేతకాని మాటలు.

ప్రశ్నలు:—దుర్యోధనుఁడు ధర్మరాజుతో ఏలజూదమాడెను? జూదము నందు నియమములేవి? అందు ఎవరోడిరి? పాండవు లజ్ఞాతవాసము ను ఎవరివద్ద గడపిరి? ఎట్లు గడపిరి? పాండవులను బయలుపెట్టుటకు ఏల దుర్యోధనుఁడు యత్నించెను? అతఁడుపన్నినఉపాయము ఏమి? ఉత్తరపు దిశయందలి గోవులనుపట్టుకొనునప్పుడు విరటరాజు ఎక్కడనుండెను? ఈ గోవులను విడిపించుటకు ఎవరు పోవలసి వచ్చెను? ఉత్తరుఁ డేమని స్త్రీజనముతో చెప్పెను.

---

# 15. ఉత్తర గోగ్రహణము.

## (రెండవ భాగము.)

బృహన్నల అను పేరుతో అర్జునుఁడు ఉత్తరకు విద్య నేర్పుచుండెను. ఉత్తరునకు సారథిగా ఉండుటకు అర్జునుఁడు ఒప్పుకొనెను.

బృహన్నల రథము తోలుచుండఁగా ఉత్తరుఁడు యుద్ధమునకు బయలుదేఱెను. కాని శత్రుసైన్యములు చూచు సరికి వానికి ఒడలు గడ గడ వడఁక సాఁగెను. “రథము తోలకుము. శీఘ్రముగ వెనుకకుఁ ద్రిప్పివేయుము” అని సారథితో దీనముగాచెప్పెను. కాని అర్జునుఁడు మఱింత వేగముగ రథము తోలుచుండెను. అందుచే ఉత్తరుఁడు మఱింత భయపడి రథమునుండి క్రిందికి ఉరికి ఇంటివైపు పరుగెత్తసాఁగెను.

బృహన్నలకూడ క్రిందకు దిగి ఉత్తరుని పట్టుకొనెను.-

బృహన్నల:—ఏల పాఱిపోయెదవు?

ఉత్తరుఁడు:—(ఏడ్చుచు) నాకు భయము పుట్టుచున్నది.

బృహన్నల:—నీవు భయపడి పాఱిపోయినచో ఆఁడువారు నవ్వరా?

ఉత్తరుఁడు:—(తలత్రిప్పుచు) నవ్విన నవ్వనిమ్ము. నేను మాతల్లికి ఒక్కఁడనే కొడుకును. ఈ కౌరవులను గెలుచుట అర్జుననకేకాని నావంటివానికి చేతగాదు. నన్ను విడువుము. బృహన్నలా! నన్ను విడువుము. నిన్నుఁ బ్రతిమాలుకొనెదను.

క. నాతోడి ప్రేముడిం గను
నాతురనై యెదురుచూచు నంబను జేతః
ప్రీతిగఁ జని యాయమఁ బొడ
సూతున్ బోనీగదే విశుద్ధ చరిత్రా!

అప్పుడు బృహన్నల లెక్కచూచి అజ్ఞాత వాసము చేయవలసిన సంవత్సరము తొలినాఁటికే పూర్తియైనదని తెలిసికొనెను. "నేనే అర్జునుఁడను" అని బయలుపడి ఉత్తరునకు తన వృత్తాంతము చెప్పివేసెను. అది విని ఉత్తరుఁడు ఆశ్చర్యపడి అతనిని కౌఁగిలించుకొనెను. బృహన్నల అర్జునుఁడని తెలియఁగానె ఉత్తరునకు భయముపోయినది. ఉత్తరుఁడు

రథము తోలుచుండగా అర్జునుఁడు యుద్ధముచేసి కౌరవులను జయించి గోవులను విడిపించెను.

**మాటలు:**—దీనముగ = జాలికలుగునట్లు, ప్రేముడి=ప్రేమ, ఆతురయై= తొందరపడి, అంబ = అమ్మ, పొడసూతున్ = చూచెదను, విశుద్ధచరిత్రా = మంచి నడవడికలవాఁడా !

**ప్రశ్నలు:**—బృహన్నల ఎవరు ? అతఁడు విరటుని కొలువులో ఏమిచేయు చుండెను ? బృహన్నలకును ఉత్తరునకును జరిగిన మాటలు ఏమి ? బృహన్నల తాను అర్జునుఁడనని ఎప్పుడు చెప్పెను ? ఉత్తరుఁ డెట్టివాఁడు ? బృహన్నల వృత్తాంతము తెలిసిన పిమ్మట అతఁడేమి చేసెను ? దుర్యోధనుని ఉపాయము ఏమాయెను ?

---

# 16. భా ర త యు ద్ధ ము .



ఎట్టి ఆటంకములు లేకుండ, పాండవులకు అరణ్యవాసము, అజ్ఞాతవాసము గడచినవి. దుష్టుఁడయిన దుర్యోధనుని ప్రయత్నములు వ్యర్థమైనవి.

రాజ్యములో తమకు రావలసిన వంతు తమ కీయవలసినదని పాండవులు దుర్యోధనుని కోరిరి. కాని దుర్యోధనునకు పాండవులపై పగతీరలేదు. అందుచేత అతఁడుయుద్ధమునకు సిద్ధపడి రాజ్యములో భాగమీయనని స్పష్టముగ చెప్పెను. పాండవులకును, కౌరవులకును భీష్ముఁడు తాత.

వారలకు ద్రోణుఁడు గురువు. భీష్మద్రోణులు దుర్యోధనునకు బుద్ధిఁజెప్పిరి. యుద్ధము కూడదని బోధించిరి. కాని ఆ మూర్ఖుఁడు పెద్దల మాటలను లక్ష్యపెట్టలేదు.

కడకు పాండవులును కౌరవులును యుద్ధముచేయవలసి వచ్చెను. ఆయుద్ధములో దుర్యోధనుని సైన్యము లన్నియు నశించెను. అతని పక్షమున యుద్ధముచేసిన భీష్ముఁడు ద్రోణుఁడు మొదలగు గొప్ప వీరులందఱు నేల ద్రావాలిరి. దుర్యోధనుని తమ్ములందఱిని భీముఁడు కడతేర్చెను. కౌరవ పక్షమున దుర్యోధనుఁడు మాత్రమే మిగిలెను. ఈపక్షమున పాండవసైన్యమునకుకూడగొప్పనష్టములు కలిగెను. పాండవుల కొడుకు లందఱును కడతేఱిరి. ఆ యుద్ధము పదునెనిమిది దినములు విరామము లేకుండ జరిగెను. మిగిలియున్న దుర్యోధనుని చంపుటకు పాండవులు ప్రయత్నించిరి. కాని దుర్యోధనుఁడు వారికి ఎక్కడను కనఁబడలేదు.

దుర్యోధనుని వెదకుటకు ధర్మరాజు ఒకబోయవానిని పంపెను. వాఁడు పలుతావులు వెదకివచ్చి దుర్యోధనుఁడొక మడుగులో దాఁగియున్నాడని చెప్పెను. వెంటనే ధర్మరాజు తమ్ములతోడను, కృష్ణునితోడను బయలుదేఱెను. బోయ వాఁడు దారిచూపఁగా వారందఱు మడుగు దగ్గఱకుఁ జేరిరి. ఆ మడుగు పేరు ద్వైపాయనము.

మాటలు:—ఆటంకము=అడ్డు, వ్యర్థము=లాభములేనిది, వంతు = భాగము, మూర్ఖుఁడు=మంచిచెడ్డలు తెలియనివాఁడు, పక్షము = వైపు, విరామము= విశ్రాంతి, పలుతావులు=అనేకచోట్లు.

ప్రశ్నలు:—పాండవులు దుర్యోధనుని ఏమి కోరిరి ? దుర్యోధనుఁ డేమని బదులుచెప్పెను? పాండవులకును కౌరవులకును యుద్ధమేల కలిగెను? అందు ఎవరు గెలిచిరి ? దుర్యోధనుఁ డేమాయెను? వానిని ధర్మరాజాదులు ఎట్లు కనుగొనిరి?

---

# 17. దుర్యోధనవధ.

ద్వైపాయనమను మడుగులో దుర్యోధనుఁడు దాఁగియుండెను. నీటిలో మునిఁగి ఎంత సేపయినను ఉండగల విద్య వానికి వచ్చును. ఆవిద్యకు జలస్తంభనము అని పేరు. అక్కడకు వచ్చి ధర్మరాజు నీటిలో దాఁగుకొనిన దుర్యోధనుని పిలిచెను.

ధర్మరాజు:—ఓరాజా ! నీవు పిఱికివానివలె నీటిలో దాఁగియుండుట శౌర్యము కాదు. ఎందఱు చెప్పినను వినక యుద్ధము చేసితివి. నీ మూలమున నీ తమ్ములు, నీకొడుకులు, నీచుట్టములు, నీస్నేహితులు కడతేఱిరి. నీవు మాత్రమే మిగిలితివి. ఒక్కడవు బ్రతికియుండి ఏమి చేయుదువు? నీవు కూడ యుద్ధము చేసి కడతేరుము. లేదా మమ్ముఁ గెలిచి రాజ్యమంతయు నీవే ఏలుకొనుము.

చ. ఇటుతగునే సుయోధన! మహీవలయంబున నిట్టిదైన్య మె
చ్చటవినజూడగల్గెనె? యసంఖ్యులురాజులు నీకుఁగాఁగ జ
చ్చుటయును బంధుమిత్రులు విశుద్ధచరిత్రులు పోరనట్లు త్రుం
గుటయును జూచి తేమిటికి గ్రుంకితి నీళ్ళను జావు దప్పునే.

దుర్యోధనుఁడు:—ధర్మరాజా! నేను మీకు భయపడి దాఁగి యుండలేదు. నాకు ఆయుధములు లేవు. అవి మీకు కలవు. ఆయుధములు లేనివానితో యుద్ధము చేయుట మీకు న్యాయమేనా?

ధర్మరాజు:—ఓయీ! నీతో మేము అన్యాయముగ యుద్ధము చేయము. నీకు కావలసిన ఆయుధము లిచ్చెదము.

దుర్యోధనుఁడు:—మీ పక్షమున చాలమంది కలరు. నేను ఒక్కఁడనే. ఒక్కనితో మీరందఱు యుద్ధము చేసెదరా!

ధర్మరాజు:—అభయము కూడ నీకు అక్కరలేదు. మాలో నీయిష్టము వచ్చిన వానితో మాత్రము యుద్ధము చేయుము.

దుర్యోధనుఁడు:—ధర్మరాజా! మీకు నేను భయపడుదునా? మీరందఱు వచ్చినను యుద్ధము చేసి ఒక్కఁడనే జయింపఁ గలను.

ఇట్లు పలికి దుర్యోధనుఁడు మడుఁగులోనుండి వెలుపలికి వచ్చెను. ధర్మరాజు వానికి పలువిధములైన ఆయుధములను

ఇచ్చెను. వానిలో ఒక గదను మాత్రము దుర్యోధనుఁడు పట్టుకొనెను. తనతో యుద్ధమునకు దిగుమని భీముని



పిలిచెను. భీమ దుర్యోధనులు ఇద్దఱు గదలతో యుద్ధము చేయ సాఁగిరి. ఆ గదాయుద్ధమును తక్కినవారు వింతగా చూచుచుండిరి.

చాలసేపు యుద్ధము ఘోరముగ జరిగెను. తుదకు

భీముఁడు తన గదతో దుర్యోధనుని తొడలపై కొట్టెను. వెంటనే తొడలు విఱిగి దుర్యోధనుఁడు నేల వ్రాలెను.

ఇంకను పగతీరక భీముఁడు తన కాలితో దుర్యోధనుని తలఁదన్నెను. వద్దువద్దని ధర్మరాజు వానిని మందలించెను.

మాటలు:—శౌర్యము = పౌరుషము, సుయోధనుఁడు = దుర్యోధనుఁడు, మహీవలయము = భూమిఅంతయు, (భూమిచక్రము), అసంఖ్యులు = లెక్కింపజాలనంతమంది, క్రుంకితివి = దాగితివి, పలువిధములు = చాలరకములు, మందలించెను = కూడదని చెప్పెను.

ప్రశ్నలు:—జలస్తంభనము అనగానేమి ? ఆవిద్యను దుర్యోధనుఁడు ఎట్లు ఉపయోగించెను ? ధర్మరాజునకును, దుర్యోధనునకును జరిగిన మాటలు ఏమి ? ఎందుకు దాగియుంటినని దుర్యోధనుఁడు చెప్పెను. అతనిని బయటకు ఎట్లు రప్పించిరి ? దుర్యోధనునితో ఎవరు యుద్ధముచేసిరి ? భీముఁడు అతనిని ఏమిచేసెను.

# 18. భీష్ముఁడు.

యుద్ధముచేసిన వీరులందఱిలో భీష్ముఁడు గొప్పవాఁడు. మంచి తనమున అతఁడందఱిని మించినవాఁడు. అతని సుగుణములు మెచ్చనివారు లేరు. అతనికిఁ గల పితృభక్తి చెప్ప తరముకాదు. తన కొడుకు భీష్ముఁడు చూపిన పితృభక్తికి మెచ్చి శంతనుఁడు భీష్మునకు వరము ఇచ్చెను. ఆ వరము స్వచ్ఛంద మరణము. స్వచ్ఛంద మరణము అనగా

ఇష్టము వచ్చినంత కాలము బ్రతుకఁ గలుగుట. ఇష్టము వచ్చినపుడు మరణించుట.

తనకు మనుమలైన పాండవుల మీఁదను, కౌరవుల మీఁదను భీష్మునకు సమానమైన ప్రేమయే కలదు. అయినను అతఁడు కౌరవుల పక్షముననే నిలిచి పాండవులతో యుద్ధము చేయవలసి వచ్చెను. పాండవులతో యుద్ధము చేయుటకు నిజముగా భీష్మునకు ఇష్టములేదు. కాని అతఁడు మొదటినుండి కౌరవులతోనే ఉండుటచేత కౌరవులకు రాజైన దుర్యోధనునితో కలియక తప్పినదికాదు.

భీష్ముఁడు పదిదినములు యుద్ధముచేసెను. ఆ పది దినములు పాండవులకు జయము కలుగునని ఆశలేక పోయినది. అతఁడు ధనుస్సు పట్టుకొని పోరుసల్పి పాండవుల సైన్యములను లక్షల కొలఁది కడతేర్చుచుండెను. ఒక్క అర్జునుఁడు తప్ప మఱెవ్వరును భీష్ముని అడ్డుకొనలేకపోయిరి. అర్జునుఁడు కూడ అప్పుడప్పుడు ఓడిపోవుచుండెను.

భీష్ముఁడు బ్రతికి యుండగా తాము కౌరవులను గెలువలేమని పాండవులు నిశ్చయించుకొనిరి. ఒకనాఁటి రాత్రి ధర్మరాజు రహస్యముగా భీష్మునికడకు వెళ్ళెను. భీష్మునకు నమస్కారముచేసి వానినిట్లు బ్రతిమాలుకొనెను. "ఓ తాతా! నీవంటి గొప్పవీరుఁడు లోకములో లేఁడు. నిన్ను ఎవ్వరును గెలువలేరు. మేమును కౌరవులును కూడ నీకు

మనుమలమే. నీవుండఁగా మేమువారిని గెలువలేము. మేము వారిని గెలుచు ఉపాయము చెప్పి మమ్ము రక్షింపుము.

క. మా కెట్లు సామ్రాజ్యము
సేకుఱు నెబ్భంగి బహుళ సేనోత్పాద
వ్యాకులత రాక తక్కఁ
జేకొని యత్తెఱఁగు కరుణ జెప్పఁగవలయున్."

భీష్ముఁడు జాలిపడి, "ఓ ధర్మరాజా! భయపడకు. మొదట ఆఁడుదియైపుట్టి తరువాత మగవాఁడయిన వానితో నేను యుద్ధము చేయను. అట్టివాఁడు శిఖండి అను పేరుతో మీలో ఒకఁడున్నాఁడు. ఆశిఖండి నిముందుంచుకొని అర్జునుఁడు యుద్ధముచేసినచో నేనుధనుస్సు ఎత్తను. అప్పుడు అర్జునుఁడు నన్ను బాణములతో కొట్టి పడవేయవచ్చును" అని చెప్పెను. ధర్మరాజు సంతసించి భీష్ముని సెలవుగైకొని తన సోదరులను జేరుకొనెను. భీష్ముఁడు చెప్పిన ఉపాయమును వారలకు తెలియపఱచెను.

మాటలు:—మించుట = ఎక్కువగుట, సుగుణములు = మంచి గుణములు, ధనుస్సు = విల్లు, ఎట్లు = ఏరీతిగ, సామ్రాజ్యము=రాజ్యము, చేకురును = దొరకును, వ్యాకులత = విచారము.

ప్రశ్నలు:—స్వచ్ఛందమరణము అనగా ఏమి? ఆమరణమును ఎవరికిచ్చిరి? ఏలఇచ్చిరి? ఎవరు ఇచ్చిరి? ఆవరమును భీష్ముఁడెప్పుడు ఉపయోగించెను? భీష్ముని గెలుచు ఉపాయమేమి?

# 19. అంపశయ్య.

ఆహా! తన్ను చంపు ఉపాయము తానే చెప్పిన భీష్ముఁడు ఎంత గొప్పవాఁడు! ఎంత మంచివాఁడు.

భీష్ముఁడు చెప్పినట్లుగానే అర్జునుఁడు శిఖండి అను వానిని ముందుపెట్టుకొని యుద్ధముచేసెను. భీష్ముని శరీరము నిండ వాడియైన బాణములు గ్రుచ్చుకొనెను. ఆ దెబ్బలవలన



బాధ భరించలేక, పాపము! భీష్ముఁడు నేలపై వ్రాలెను. భూమిపైఁ బడినప్పుడు వాని శరీరమున గ్రుచ్చుకొనిన బాణ

ములే వానికి మంచమువలె ఏర్పడినవి. అతఁడు భూమిని అంటకుండ బాణములమీదనే పండుకొని యుండెను.

ఇట్లు భీష్ముఁడు పడినంతనే పాండవులు కౌరవులు తమ తమ బాణములు విడిచివచ్చిరి. వాని చుట్టును మూఁగి ఊరక విచారించిరి. అట్లు మూఁగిన మూకలో అర్జునునిజూచి భీష్ముఁడు "అర్జునా! నా తలక్రింద తలగడ కావలెను" అని అడిగెను. అప్పుడు అర్జునుఁడు వాని తలక్రింద భూమిలో బాణములు గ్రుచ్చఁగా ఆ బాణములపై అతఁడు తన తల పెట్టుకొనెను. పిమ్మట భీష్ముఁడు "నాకు పెదవులు ఎండి పోవుచున్నవి." అనెను. కౌరవులు తేటయైన మంచినీరు తెచ్చి వానికిచ్చిరి. ఆ నీరు పుచ్చుకొనక అతఁడు అర్జునుని వైపుచూచెను. అర్జునుఁడు మంత్రించిన బాణములు భూమిలో విడువఁగా భూమిలోనుండి శుభ్రమైన గంగ పైకి ఉబికి వచ్చినది. ఆ గంగను అతఁడు త్రాగి సంతసించెను.

భీష్ముఁడు పడిపోయిన కాలము దక్షిణాయనము. అప్పుడు చచ్చువారికి పుణ్యము గలుగదు. అందుచే అతఁడు తండ్రి యిచ్చిన వరముచేత అప్పుడు మరణించక ఉత్తరాయణము రాగానే ప్రాణములు విడిచెను.

భీష్ముని యనంతరము మఱి యెనిమిదినాళ్ళు యుద్ధము జరిగెను. ఆ మహాసంగ్రామములో కౌరవులు ఓడిపోయిరి. ఇంచుమించుగ వారందఱును గతించిరి పాండవులు జయము

పొందిరి. ధర్మరాజునకు పట్టాభిషేకము జరిగెను. ధర్మరాజు తమ్ముల సహాయముతో రాజ్యమును బాగుగ పాలించెను.

మాటలు:—భరించుట = సహించుట, (ఓర్చుట), శరీరము = ఒడలు, శుభ్రమైన = మురికిలేని, (మంచి), అనంతరము = తరువాత, మహా సంగ్రామము = గొప్పయుద్ధము, పట్టాభిషేకము = పట్టముకట్టుట.

ప్రశ్నలు:—అర్జునుఁడు భీష్మునితో ఎట్లు యుద్ధముచేసెను? భీష్ముఁడు యుద్ధములో ఏమాయెను? అతనికి తలగడ అర్జునుఁడు ఎట్లు నిర్మించెను? అతనికి త్రాగుటకు నీరు ఎట్లు పుట్టించిరి? ఉత్తరాయణము వఱకు భీష్ముఁడు ప్రాణమును ఎట్లు నిలుపుకొన గలిగెను?

# 20. హిరణ్యకశిపుఁడు.



పూర్వము హిరణ్యకశిపుఁడు హిరణ్యాక్షుఁడు అను ఇద్దఱు అన్నదమ్ములు కలరు. ప్రపంచములో అంతటి బలవంతులు లేరు. అంతటి దుర్మార్గులును లేరు. వారు రాక్షసులైనను ఘోరమైన తపస్సుచేసిరి. బ్రహ్మ వారి తపస్సునకు మెచ్చి వారు కోరిన వరములిచ్చెను.

లోకములో ఎవ్వరును కోరని గొంతెమ్మ కోరికలు వారు కోరిరి. ఆవరముల గర్వముచేత వారలిద్దఱు దేవతలను, మునులను, మనుష్యులను ఎల్లప్పుడు బాధపెట్టుచుండిరి. లోకములో ఎవ్వరును వారిబాధలను భరించలేక

పోయిరి. అప్పుడు భగవంతుడైన మహావిష్ణువు వరాహ రూపముతో వచ్చి హిరణ్యాక్షుని చంపివేసెను.

తన తమ్ముని చంపిన విష్ణువును చంపవలెనని హిరణ్య కశిపుడు ప్రయత్నించు చుండెను. "ఎవ్వరును విష్ణునిగూర్చి తపస్సుచేయగూడదు. వానిని పూజచేయకూడదు. ఆపేరు నోట పలుకకూడదు" అనివాడు కఠినముగ ఆజ్ఞాపించెను. కేశవుడు, నారాయణుడు, మాధవుడు, గోవిందుడు, హరి మొదలైనవి విష్ణుదేవుని పేర్లు. ఈపేర్లు తలచిన వారిని హిరణ్యకశిపుడు శిక్షించు చుండెను. ఇట్లుండగా రాక్షసరాజగు హిరణ్యకశిపునకు కుమారుడు కలిగెను. వాని పేరు ప్రహ్లాదుడు. ప్రహ్లాదుడు అయిదేండ్లవాడు కాగానే తండ్రి వానికి అక్షరాభ్యాసము చేయించెను. వానికి చదువు చెప్పుమని గురువునకు ఒప్పగించెను.

క. చదువని వాడజ్ఞుండగు
చదివిన సదసద్వివేకచతురత గలుగున్
చదువగ వలయును జనులకు
జదివించెద నార్యులొద్ద జదువుము తండ్రీ!

ప్రహ్లాదుడు అయ్యవారు చెప్పిన పాఠములను చదువ కుండెను. "కేశవా, నారాయణా, మాధవా" అని పాడుచు చప్పట్లు చఱచుచు గెంతుచుండెను. బడిలోనున్న తక్కిన

పిల్లలుకూడ చదువులు కట్టిపెట్టి ప్రహ్లాదునితో పాడుచు నాడుచుండిరి.



ఈసంగతి హిరణ్యకశిపునకు తెలిసెను. కుమారుని చేష్టలకు రాక్షసరాజు మిగుల చింతిల్లెను.

**మాటలు:**—ప్రపంచము = లోకము, దుర్మార్గులు = చెడ్డవారు, ఘోరమైన = భయంకరమైన, గొంతెమ్మకోరికలు=చెడుకోరికలు, వరాహము=పంది, అజ్ఞుఁడు = తెలియనివాఁడు, సదసద్వివేకచతురత= మంచిచెడ్డలను తెలిసికొను నేర్పు, ఆర్యులు = పెద్దలు, చేష్టలు= పనులు.

**ప్రశ్నలు:**—హిరణ్యాక్షుఁడెవరు ? అతనిని ఎవరుచంపిరి ? అతని అన్న ఎవరు ? హిరణ్యకశిపునకు విష్ణువుమీద పగయేల ? విష్ణువు పేర్లు ఏమి ? చదువువలన లాభములేవి ? ప్రహ్లాదుఁడు గురువువద్ద ఎట్లు చదువుకొనెను?

# 21. నరసింహావతారము.



తన వంశమునకు శత్రువగు విష్ణువును ప్రహ్లాదుఁడు తలఁచు చుండెనని హిరణ్యకశిపునకు తెలిసెను. హరిభక్తి కూడదని బోధించుటకు హిరణ్యకశిపుఁడు కుమారుని పిలిచెను.

తండ్రి:—నాయనా! బడిలో నీవు ఏమి నేర్చుకొంటివి ?

కొడుకు:—నాయనగారూ! నేను దైవభక్తి నేర్చుకొంటిని?

తండ్రి:—దైవభక్తియా ? ఎవఁడా దైవము ?

కొడుకు:—హరియే దైవము.

తండ్రి:—హరి యెవఁడు ?

కొడుకు:—కేశవుఁడు.

తండ్రి:—కేశవుఁడా ? అతఁడెవఁడు ?

కొడుకు:—అతఁడు నారాయణుఁడు. అతఁడే గోవిందుఁడు.

తండ్రి:—తప్పు, తప్పు, అట్లు అనకూడదు. ఆ నారాయణుఁడు నీపినతండ్రిని చంపివేసినాఁడు. వాఁడు మనకు శత్రువు. వాని పేరు చెప్పకూడదు. ఇఁక మీఁద వానిమాట మానెదవా లేదా ?

కొడుకు:—నేను మానను.

హిరణ్యకశిపునకు చాల కోపము వచ్చినది. హరిభక్తి మానిపించవలెనని అతఁడెన్నో ప్రయత్నములు చేసెను. కాని ప్రహ్లాదుఁడు మానలేదు. తండ్రికి ప్రాణములు విసిగినవి. కోపము ఎక్కువయినది. అందుచేత అతఁడు కొడుకును చంపించుటకు నిశ్చయించెను.

ప్రహ్లాదుని పెద్దకొండమీఁదనుండి క్రిందకు త్రోయించెను. కాని అతని కేమియు నొప్పి కలుగ లేదు. విషము త్రాగించెను. ప్రహ్లాదుఁడు పానకమువలె త్రాగెను. పాములచే కఱపించెను. ప్రహ్లాదునకు చీమ కుట్టినట్లైన లేదు. ఇంకను ఎన్నోవిధముల ప్రహ్లాదుని చంప యత్నించెను. ఎన్ని చేయించినను ప్రహ్లాదుఁడు చావలేదు. హరిభక్తి మానలేదు. హిరణ్యకశిపుఁడు ఆశ్చర్యపడి మఱల కొడుకును పిలిపించి మాటాడెను.

తండ్రి:—ఓరీ ప్రహ్లాదా? నీహరి యెక్కడున్నాఁడురా?

కొడుకు:—తండ్రీ? ఎక్కడచూచిన అక్కడనే ఉన్నాఁడు.

తండ్రి:—ఈ స్తంభములో ఉన్నాఁడా?

కొడుకు:—ఉన్నాఁడు.

హిరణ్యకశిపుఁడు కోపముతో స్తంభమును ఒక్క తన్ను తన్నెను. వెంటనే ఆ స్తంభము విఱిగిపడినది. అందులో నుండి భగవంతుఁడు నరసింహ రూపముతో వెడలెను.



నరసింహమూర్తి హిరణ్యకశిపుని తన గోళ్ళతో చీల్చి చంపి
ప్రహ్లాదుని రక్షించెను.

మాటలు:—దైవము=దేవుఁడు, నరసింహుఁడు=సగము మనుష్యుఁడు సగము సింహము గల రూపము గలవాఁడు, రక్షించెను=కాపాడెను.

ప్రశ్నలు:—హిరణ్యకశిపుఁడు తన కొడుకును ఏమని అడిగెను ? అందులకు అతఁడేమని బదులుచెప్పెను ? హిరణ్యకశిపుఁడు స్తంభమును ఏల తన్నెను? అందుండి ఎవరు వచ్చిరి ? నరసింహమూర్తి ఏమిచేసెను ?

# 22. కార్తవీర్యుఁడు.



పరశురాముఁడు జమదగ్ని అను మునికి కడసారి కొడుకు. పరశువు అనగా గండ్రగొడ్డలి. పరశురామునకు గండ్రగొడ్డలి ఆయుధము కావున వానికి ఆపేరు వచ్చినది. శ్రీరాముఁడు, అర్జునుఁడు, భీష్ముఁడు మొదలైన వారివలెనే పరశురాముఁడు గొప్పవీరుఁడు. భీష్మునివలె మంచి పితృభక్తి గలవాఁడు.

ఒకనాఁడు కార్తవీర్యుఁడు అను రాజు వేఁటాడి అలసి జమదగ్నియొక్క ఆశ్రమమునకు వచ్చెను. ఆ కార్తవీర్యుఁడు లోకములోని రాజులందఱిలోను గొప్పవాఁడు. వానికి వేయి చేతులు గలవు. జమదగ్ని కార్తవీర్యుని, వాని పరివారమును ఆదరించెను. తన కామధేనువుచేత వారికి కావలసిన భోజనములను పెట్టించెను. రాజును, వారి పరివారమును ఆధేనువు పెట్టిన పిండివంటలతో భోజనము చేసిరి.

వారికి కావలసిన భోజనపదార్థములను కామధేనువు పుట్టించ గలిగినందులకు ఆశ్చర్యపడిరి. ఇంటికి పోవునప్పుడు దానిని బలవంతముగా తీసికొని పోయిరి. బలవంతుఁడైన రాజును అడ్డగించలేక జమదగ్నియు వాని కొడుకులును విచారించుచుఊరకుండిరి. అప్పుడు పరశురాముఁడుఇంట లేఁడు. ఇంటికి వచ్చినతోడనే ఈ సంగతి పరశురామునికి తెలిసెను.



ఆ. అద్దిరయ్య! యింట నశనంబు గుడిచి మా
యయ్య వలదనంగ నాక్రమించి

కోరిమొదవు రాజు గొనిపోయినాఁడట
యేను రాముఁడౌట యెఱుఁగఁ డొకో.

అనుచు పరశురాముఁడు మండిపడుచు పండ్లుకొఱుకుచు కార్తవీర్యునిపైకి యుద్ధమునకు వెళ్ళెను.

కార్తవీర్యుఁడు పరశురామునితో యుద్ధము జేసెను. ఆ పరశురాముఁడు యుద్ధములో పరశువుతో వాని వేయి చేతులును, శిరస్సును తెగఁగొట్టి కామధేనువును తెచ్చెను.

పరశురాముని శౌర్య సామర్థ్యములకు వాని తల్లిదండ్రులు మిక్కిలి సంతోషించి వానిని మెచ్చుకొనిరి.

**మాటలు:**—పితృభక్తి = తండ్రియెడల భక్తి, ఆశ్రమము = ముని ఉండు చోటు, పరివారము = వెంబడి వచ్చువారు, ఆదరించెను = గౌరవించెను, కామధేనువు = కోరినదానిని ఇచ్చు ఆవు, అశనము = తిండి, మొదవు = ఆవు, ఆక్రమించి = బలవంతముగ తీసికొని.

**ప్రశ్నలు:**—పరశురాముఁ డెవరికొడుకు? అతనికి ఆ పేరెట్లు వచ్చెను? కార్తవీర్యుఁడు చేసిన తప్పుపని ఏమి? అతనిని ఎవరు శిక్షించిరి? ఎట్లు శిక్షించిరి? కామధేనువు అనగా నేమి?

---

# 23. పరశురాముఁడు.

ఒకనాఁడు పరశురాముని తల్లి రేణుక నీటికై యేటికి పోయినది. ఆ యేటిలో ఒక సంపన్నుఁడు తన భార్యలతో స్నానము చేయుచుండెను. రేణుక వారిని వింతగా చూచుచు

చాలసేపు అక్కడనే నిలిచిపోయెను. ఆలస్యమగు చున్నదని ఆమెకు తోచలేదు.

నీరు లేనందున తపస్సుమాని జమదగ్ని భార్యకొఱకు ఎదురు చూచుచు కూర్చుండెను. చాలసేపటికి రేణుక నీరు తెచ్చెను. ఆమె చేసిన యాలస్యమునకు జమదగ్నికి మిక్కిలి కోపము వచ్చినది. ఆమెను చంపివేయుఁడని ముని తన కొడుకులకు ఆజ్ఞాపించెను. ఎట్టి కొడుకు లయినను తల్లిని చంపుదురా! రేణుకను చంపుటకు కొడుకులు ఇష్టపడలేదు. జమదగ్నికి కొడుకుల మీఁద కూడ కోపము వచ్చెను. "నీతల్లిని అన్నలను చంపివేయుము" అని పరశురామునకు ఆజ్ఞాపించెను.

తండ్రి చెప్పినట్లు చేసిన యెడల అతఁడు మెచ్చి వర మిచ్చుననియు ఆ వరముచే తల్లిని, సోదరులను మఱల బ్రతికింప వచ్చుననియు, పరశురాముఁడు తలఁచెను. తండ్రి సెలవు ప్రకారము తల్లిని, అన్నలను గండ్రగొడ్డలితో తెగ వేసెను. అతఁడు తలఁచినట్లే, "పరశురామా! నీకు కావల సిన వరము కోరుము" అని తండ్రి అడిగెను. వెంటనే పరశు రాముఁడు "మా తల్లిని, అన్నలను బ్రతికింపుడు" అని కోరెను. అతఁడు కోరినట్లే జమదగ్ని వారందఱిని బ్రతికించెను.

కార్తవీర్యునకు పదివేలమంది కొడుకులుకలరు. వారు జమదగ్ని ఆశ్రమమునకువచ్చి "ఈముసలివాఁడే మాతండ్రిని చంపించెను" అని జమదగ్నిని బట్టి చంపివేసిరి. అప్పుడు

పరశురాముఁ డింటిలో లేఁడు. అతఁడు వచ్చుసరికి అన్నలు గొల్లున నేడ్చుచుండిరి. శవముపైఁ బడి యేడ్చుచున్న రేణుక పరశురాముని చూచి, "నాయనా! ఇంక మీతండ్రి లేఁడు. మీ తండ్రి లేఁడు" అని యిరువది యొక్క మారులు బుఱ్ఱ కొట్టుకొనినది. తండ్రిచావునకు పరశురాముఁడు దుఃఖించెను. కొంతసేపునకు తల్లిని, అన్నలను ఓదార్చి గండ్రగొడ్డలితో బయలు దేఱెను.

పరశురాముఁడు కార్తవీర్యుని కొడుకులను పదివేల మందిని కడతేర్చెను. అంతేకాక పేరునకు ఒక్క రాజయిన లేకుండ లోకములోని రాజుల నందఱిని ఇరువది యొక్క మారులు యుద్ధముచేసి కడతేర్చెను. రాజులను చంపి వారి రక్తముతో ఏడుమడుగులు చేసెను.

ఆ. అయ్యపగకు రాముఁ డలయక రాజుల
నిరువదొక్కమారు నరసి చంపె
జగతిమీఁద రాజశబ్దంబు లేకుండ
సూడు దీర్పలేని సుతుఁడు సుతుఁడె ?

మాటలు:—సంపన్నుఁడు = ధనముగలవాఁడు, ఆజ్ఞాపించెను = ఉత్తర్వు చేసెను, బుఱ్ఱ = తల, శబ్దము = మాట, అలయక = విసుగుచెందక, సూడు = పగ.

ప్రశ్నలు:—రేణుక చేసిన తప్పిదముఏమి ? ముని ఆమెకు ఏమి శిక్ష విధించెను ? అందుపై కొడుకులేమనిరి ? పరశురాముఁడు ఏమిచేసెను ? అట్లు తల్లిని అన్నలను అతఁడేల చంపెను ? పరశురామునికి తండ్రి ఏమి వరమిచ్చెను ?

# 24. భరతుఁడు.

(మొదటిభాగము.)



భరతుఁడు సాటిలేని మహారాజు. అతఁడు చాల కాలము న్యాయముగా రాజ్యముచేసెను. పిమ్మట తపస్సు



చేసికొనుటకు అడవికిపోయెను. దేవునిపై వానికి గాఢమగు

భ_క్తి కలదు. భరతుఁడు ప్రహ్లాదుని వంటివాఁడు. అతఁడు మునులవలె వనములో తపస్సు చేసికొనుచుండెను.

ఒకనాఁడు భరతుఁడు నదికిపోయి స్నానము చేసి నదియొడ్డున జపము చేసికొనుచుండెను. అప్పుడు కడుపుతో నున్న యొక యాఁడులేడి నదికివచ్చి నీరు త్రాగుచుండెను. ఇంతలో చేరువనుండి భయంకరమైన సింహగర్జనము దానికి వినిపించెను. తోడనే ఆలేడి భయముచే త్రుళ్ళిపడి ఒక్క ఎగురు ఎగిరెను. ఎగిరినప్పుడు దాని కడుపులోనున్న లేడిపిల్ల జాఱి నీళ్ళలో పడినది. తల్లిలేడి ఒక రాతిపైబడి ప్రాణములు విడిచెను.

నీటిపై తేలి కొట్టుకొనుచుండిన లేడిపిల్లను భరతుఁడు చూచెను. మెల్లగా దానిని పట్టుకొని తనతో తీసికొనివచ్చి యాశ్రమములో పెంచుచుండెను.

క. శరణని వచ్చిన జంతువు
కరుణం గనువిచ్చి చూచి కాచినఁ బుణ్యం
బరయఁగ నధికంబని మున్
కర మెఱిఁగించిరి మునీంద్రగణములు ప్రేమన్.

తల్లిలేనిదని జాలిపడి లేడిపిల్ల నతఁడు తన ప్రాణముల వలె చూచుకొనుచుండెను. దానిమీఁద వానికెంతో ముద్దు. దానిని విడిచి భరతుఁడొక క్షణము కూడ నిలువలేఁడు. కన్నపిల్లను కూడ తల్లిదండ్రు లింతముద్దుగా పెంచరు. ఆలేడి

కిని వానిదగ్గఱ మిగుల చనువు. అతఁడు తపస్సు చేసికొనుచున్నప్పుడువచ్చి తన కొమ్ములతో వానివీపు గోకుచుండెను. అతఁడు తపస్సు మాని సవ్వుకొనుచు దానిని ముద్దులాడుచుండెను.

ఆ లేడిపిల్లతో ఆటలాడుచుండుటచే భరతుని తపస్సు అంతకంతకు తగ్గిపోయినది. అతఁడు తన బ్రతుకంతయు లేడితోనే గడపి కడకు ప్రాణములు విడిచెను.

మాటలు:— సాటిలేని = సమానములేని, గాఢమగు = ఎక్కువగు, వనము = అడవి, భయంకరమైన = భయమును కలిగించు, గర్జనము = అరపు, శరణు = కాపాడుట, కడకు = తుదకు, కాచిన = కాపాడిన.

ప్రశ్నలు:— భరతుఁడెట్టిరాజు ? అతనికి లేడిపిల్ల ఎట్లుదొరకెను ? దానిని అతఁడెట్లు పెంచెను? దానివలన అతని తపస్సునకు ఏమి జరిగినది ?

---

# 25. భరతుఁడు.

(రెండవభాగము.)

భరతుఁడు ప్రాణములు విడుచునప్పుడు లేడిని విడిచిపెట్టలేకపోయెను. మనస్సు దాని మీఁదనే నిలిపి చనిపోయెను. అందుచేత వానికి లేడిపుట్టుక వచ్చినది.

భరతుఁడు లేడియైపుట్టి తన తెలివితక్కువచేతనే తన తపస్సు చెడిపోయినదని విచారించుచుండెను. అట్లు విచా

రించుచు లేడియైన భరతుఁడు కొంతకాలమునకు ప్రాణములు విడిచి బ్రాహ్మణుఁడై మరల పుట్టెను.

బ్రాహ్మణుఁడై పుట్టిన భరతునకు చిన్నప్పటినుండియు దైవభక్తి తప్ప మఱియొక యాలోచనయే లేదు. ఎవ్వరి జోలికిని పోక యెవ్వరి తోడను మాటాడక యెప్పుడును తపస్సుచేసికొనుచు కాలము గడుపుచుండెను. అట్లుండఁగా పాపము! వాని తల్లి దండ్రులు చనిపోయిరి. సవతితల్లి భరతుని యింటిలో ఉండనీయక పొలము కాఁపునకు పంపించెను. భరతుఁడు పొలము కాచుచునే తపస్సు చేసికొను చుండెను.

ఇట్లుండఁగా ప్రక్కదేశపు రాజునకు సంతానము లేకుండెను. ఒక మనుష్యుని కాళికాదేవికి బలివేసిన సంతానము కలుగునని యారాజు యోచించెను. ఎవ్వరి నైనను పట్టి తెండని భటులను పంపించెను. ఆ భటులు వెదకి వెదకి పొలము కాచుచు తపస్సు చేసికొనుచున్న భరతుని కాళికాదేవి గుడికి మోసికొని పోయిరి. అంతటి గొప్ప భక్తుని తనకు బలివేయుటకు తెచ్చిరని కాళికాదేవి కోపించి యా రాజును, భటులను కూడ చంపివేసెను. భరతుఁడు బ్రతికి వచ్చి పొలము కాచుచుండెను.

మఱికొన్ని నాళ్ళకు మఱియొక రాజు తపస్సుచేయు విధమును నేర్చుకొనుటకు కపిలుఁడను మునియొద్దకు వచ్చు

చుండెను. ఆ రాజు సవారిలో కూర్చుండగ బోయలు మోయుచుండిరి. ఆపొలము దగ్గఱకు వచ్చుసరికి బోయలలో నొకఁడు డలసిపోయెను. అతఁడు భరతుని లాగుకొనివచ్చి తనవంతు సవారిమోత వానిపై పెట్టెను. భరతుఁడు మాఱు మాటాడక సవారి మోయుచుండెను.

అప్పుడు సవారి మునుపటివలె గాక యిటు నటు కదలుచుండెను. రాజు బోయలపై కోపింపగా వారు భరతుని చూపి యతఁడు సరిగా మోయకున్నాఁడని చెప్పిరి. రాజు భరతుని తిట్టి కొట్టెను. అంతట భరతుఁడు "రాజా! నాకు తపస్సు తప్ప సవారిమోత తెలియదు" అని చెప్పుచు తపస్సుచేయుటను గూర్చి వానికి చక్కఁగా బోధపఱచెను. అతఁడు గొప్పభక్తుఁడని రాజు తెలిసికొనెను. "తప్పుచేసితిని క్షమింపుము" అని వాని కాళ్ళు పట్టుకొనెను.

**మాటలు:**—పుట్టుక = పుట్టుట, జోలికి = తెరువుకు, బలివేసిన = చంపిన, భటులు = నౌకరులు, బోధపఱచెను = బోధించెను.

**ప్రశ్నలు:**—భరతుఁడు లేడిపిల్ల నెటుల ప్రేమించెను? అందుచేత అతఁడే మయ్యెను? లేడియైపుట్టిన భరతుఁడేమయ్యెను? భరతుఁడు బ్రాహ్మణుఁడై పుట్టి యేమి చేసెను? భరతుని సవతితల్లి యేమిచేసెను? దానివలన భరతునికేమి సంభవించెను? భరతుఁడు సవారిమోయుచు యేమనెను? అందుకు రాజేమి చేసెను?

# 26. శ్రీకృష్ణుని బాల్యము.

(మొదటిభాగము.)

యమునానదిదగ్గఱ వ్రేపల్లెయను పల్లెటూరు కలదు. అందులో కాపురమున్నవారందఱును గొల్లలే. ఆగొల్లలకు నందుఁడు పెద్ద.



బలరాముఁడు కృష్ణుఁడు అనువారలుగ విష్ణుదేవుఁడు

వ్రేపల్లెలో పుట్టి పెరుగుచుండెను. వారిలో బలరాముడు పెద్దవాడు. వాని తల్లిపేరు రోహిణి; కృష్ణుడు చిన్నవాడు. వాని తల్లిపేరు యశోద; తండ్రి నందుడు. దుర్మార్గులైన రాక్షసులను చంపుటకు బలరామ కృష్ణులు పుట్టిరి.

ఆకాలములో కంసుడు అను దుష్టుడు రాజ్యము చేయుచుండెను. కృష్ణుడు పెద్దవాడైన పిమ్మట తన్ను చంపునని కంసుడు భయపడెను ఎటులైనను కృష్ణుని చంపి వేయవలెనని వాడు నిశ్చయించుకొనెను.

కంసుని యాజ్ఞమీద పూతన యను రక్కసి వ్రేపల్లెకు వచ్చెను. ఆమె తన చనుబాలలో విషము కలిపి కృష్ణునకిచ్చి యతనిని చంపవలెనని వచ్చెను. మాఱువేషముతో వచ్చిన పూతన రక్కసియని యశోదకు తెలియక పోయెను. పాపము! యశోద "ఎవతెయో బాలుని చూడ వచ్చెను" అని యనుకొనెను. అప్పుడు కృష్ణుడు ఒంటినిండ నూనెతో మంచముమీద వెల్లకిల పరుండి యుండెను. కృష్ణునిచూచి పూతన కొంతసేపు ముద్దులాడెను. తరువాత మెల్లగా తీసి యొడిలో కూర్చుండబెట్టుకొని చనుబాలిచ్చెను. కృష్ణుడు విషముకలసిన ఆమెపాలతోబాటు ఆమెరక్తము, మాంసము, ప్రాణములుకూడ పీల్చివేసెను. పూతన 'మొఱ్ఱో' యని యఱచుచు పెద్దకొండవలె నేలపై బడి తన్నుకొని చచ్చెను.

యశోద బాలుని తటాలున లాగుకొని భయముతో పొరుగింటికి పాటిపోయెను. ఆ రక్కసి పెట్టిన కేకలు విని నందుఁడు గొల్లలందఱితో పరుగెత్తుచు వచ్చెను. వారందరు పడియున్న రక్కసిని చూచి యాశ్చర్యపడిరి. అంత చిన్న పిల్లఁడు అంత పెద్దరక్కసి నెట్లు చంపఁగలిగెనో యని మిక్కిలి వింతపడిరి.

మాటలు:—దుష్టుఁడు=చెడ్డవాఁడు, పల్లెటూరు=చిన్న యూరు.

ప్రశ్నలు:—శ్రీకృష్ణ బలరాములెవరు? కంసుఁడెవరు? అతఁడేల భయపడెను? కృష్ణుని చంపుటకు కంసుఁడు ఎవరిని పంపెను? పూతన కృష్ణుని ఎట్లు చంపచూచెను? కృష్ణుఁడెట్లు తప్పించుకొనెను? పూతనగతి ఏమయినది?

---

# 27. శ్రీకృష్ణుని బాల్యము.

(రెండవ భాగము.)



పూతన చనిపోయిన వార్తవిని కంసుఁడు మఱింత భయపడెను. కృష్ణుని చంపుటకు కంసుఁ డనేక ప్రయత్నములు చేసెను.

ఒకనాఁడొక రాక్షసుఁడు బండివలెకనబడుచు వ్రేపల్లెకు వచ్చెను. అతఁడు కృష్ణుని పైనబడి భూమిలోనికి త్రొక్కివేయుటకు ప్రయత్నించెను. నెలలపిల్లడైయున్న కృష్ణుఁడు తన

కాలితో ఒక్క తన్నుఁదన్ని యాబండిని ముక్కముక్కలుగా చేసెను.

మఱికొన్నినాళ్ళకు ఇంకొక రాక్షసుఁడు సుడిగాలియై వచ్చి కృష్ణుని యాకాశము మీఁదికి ఎత్తుకొని పోయెను. రాక్షసులు కృష్ణుని చంపివేసిరని తల్లిదండ్రులును తక్కిన వారును యేడువసాగిరి. కొంతసేపునకు పైనుండి యొకరాక్షసుఁడు పెద్దకొండవలె దబ్బున నేలమీఁదపడి రక్తము గ్రక్కుచు చచ్చెను. గొల్లలు దగ్గఱకుపోయి చూచుసరికి రాక్షసుని గుండెమీఁద కృష్ణుఁడు చఱచుచు చిఱునవ్వు నవ్వుచు ఆడుకొను చుండెను.

ఇట్లు భగవంతుఁడు కృష్ణుఁడై పుట్టి, పుట్టిన సంవత్సరములోనే యెందఱినో రాక్షసులను చంపెను. ఈ రాక్షసులందఱును కంసునిచేత పంపఁబడిన వారే. నాలుగైదేండ్ల వయసు వచ్చినంతనే కృష్ణుఁడు బలరామునితోడను మఱికొందఱు గొల్లపిల్లలతోడను వీధులలో తిరుగుచుండెను. అతఁడు గొల్లవారి యిండ్లలోదూరి గోపికలను బాధపెట్టుచుండెను. వారి కుండలలోని పాలు త్రాగివేయు చుండెను. మీఁగడ తినివేయు చుండెను. పెరుగుకుండలు బ్రద్దలు కొట్టుచుండెను. వారిదేవతా విగ్రహములను వీధులలో పాఱవేయు చుండెను.

ఇల్లు దాఁటి యెక్కడకు పోవద్దని యశోద యెన్నో మాఱులు కృష్ణుని మందలించెను. కాని యతఁడు ప్రతి యింటికి తిరుగుచునే యుండెను. ఒకనాఁడు తల్లికి మిక్కిలి కోపమువచ్చినది. అతనిని ఱోటికి కట్టివేయవలెనని త్రాడు తెచ్చెను. ఎన్ని పెద్ద పెద్ద త్రాళ్ళు తెచ్చినను కృష్ణుని కడుపుచుట్టు కట్టుటకు చాలకపోవుచుండెను. ఆవిచిత్రమునకు యశోద యాశ్చర్యపడెను. "ఆహా! ఇంత చిన్నపిల్లఁడు! ఎన్ని త్రాళ్ళు తెచ్చినను వీనిని కట్టుటకు చాలకున్నవి. ఇతఁడు భగవంతుఁడు కాఁబోలు!" అని యనుకొనెను.

క. తజ్జనని ఱోఁగిటం గల
రజ్జు పరంపరలఁ గ్రమ్మఱన్ సుతుఁగట్టన్
బొజ్జ దిరిగిరాదయ్యె జ
గజ్జాలము లున్న బొజ్జఁ గట్టన్ వశమే.

మాటలు:—వార్త = కబురు, చిఱునవ్వు=చిన్నినవ్వు, వయసు=ఈడు, దేవాతా విగ్రహములు=దేవుఁడని మ్రొక్కు-బొమ్మలు, విచిత్రము= వింత, తజ్జనని = ఆతల్లి, రజ్జు = త్రాఁడు, పరంపర=వరుస, జగజ్జాలము = అనేక లోకములు, వశము = వీలు, (తరము).

ప్రశ్నలు:—కృష్ణుని చంపుటకు రాక్షసులు ఏరూపమున వచ్చిరి? వారిని కృష్ణుఁడేమిచేసెను? కృష్ణుఁడు ఏవిధమున అల్లరి చేయుచుండెను? యశోద కృష్ణుని ఏమని మందలించెను? ఱోటికి కృష్ణుని ఏలకట్టఁదలఁచెను? అట్లు కట్టుట ఏల జరుగలేదు?

---

# 28. కృష్ణలీలలు.



ఇండ్లలోదూరి కృష్ణుఁడు చేయుచుండిన వెంకె పనులను గోపికలు భరింపలేకపోయిరి. ఏమి చేయుటకును వారికి తోచలేదు.

కొందఱు గోపికలు వానిని పట్టుకొని కొట్టవలయునని ప్రయత్నించిరి. కాని బాలకృష్ణుఁడు వారికి దొరికినట్లే కనఁబడి పట్టుకొనబోవునరికి తటాలున మాయమగు చుండెను. వాని బాధలు భరింపలేక యొకనాఁడు కొందఱు గోపికలు యశోద దగ్గఱకువచ్చి మొఱపెట్టుకొనిరి. అప్పుడు కృష్ణుఁడు తల్లితొడపైకూర్చుండి వెన్నముద్ద తినుచుండెను.

మొదటిగోపిక:—తల్లీ! ఏచాటుననో వచ్చి యుట్టిమీఁది పెరుగంతయు త్రాగి నేను నిద్రపోవుచుండగా నా మూఁతికి కొంత పెరుగుఁరాచి నీకొడుకు పాఱిపోయి నాఁడు. ఇంతలో మాయత్తగారు వచ్చి నామూఁతి చూచి పెరుగు నేనే త్రాగివేసితినని నన్ను గట్టిగా మర్దించెను.

రెండవది:—అమ్మా! మాపొరుగింట నీకొడుకు నేయిత్రాగి నేతికుండలు మా గుమ్మములో పడవేసెను. వారి

నేయి మేము దొంగిలించితిమని వారు మాతో జగడము చేయుచున్నారు.

మూఁడవది:—యశోదా! నీకొడుకు నాకొడుకులను మాటి మాటికి కాళింది మడుగుదగ్గఱకు తీసికొని పోవుచున్నాఁడు. అందులో పెద్దపాముకలదని నీ వెఱుఁగుదువుకదా! ఆ మడుగులోని నీరుత్రాగి యెందఱో చనిపోయిరి. తల్లీ! అక్కడకు పోకుండ చేసినగాని నీకొడుకునకును నాకొడుకులకును బలవంతపు చావు తప్పదు.

ఇట్లు గోపికలందఱును కృష్ణుఁడు చేసినకొంటెపనులు యశోదతో చెప్పిరి. యశోద యాశ్చర్యపడి "అమ్మలారా! అక్కలారా! ప్రొద్దుననుండియు నాకొడుకు నాయొద్దనే యున్నాఁడుకదా! మీయిండ్ల కెప్పుడు వచ్చినాఁడు? నా కొడుకుపై కొండెములు చెప్పకుఁడు" అని వారినిపంపివేసెను. గోపికలు వెళ్ళఁగానే కృష్ణునిచూచి "నాయనా! ఆ మడుగు దగ్గఱకు మాత్ర మెన్నఁడును వెళ్ళకుమా! అందులో పడిపోయి యెందఱో పిల్లలు చనిపోయిరి. అక్కడకు వెళ్లినచో నిన్నుగట్టిగా కొట్టెదను" అని యశోద చెప్పెను.

తల్లి కోపించినదని కృష్ణుఁడుఅలిగి ఱివ్వున పాఱిపోయెను. అతఁడు పారిపోవుచుండ వాని స్నేహితులైన గొల్లపిల్లలు కూడ వానితో బరుగెత్తిరి. వారందఱు కాళింది మడుగుదగ్గఱకు వచ్చిరి.

మాటలు:— పెంకెపనులు = కొంటెపనులు, (అల్లరిపనులు), గోపికలు = గొల్లకులము స్త్రీలు, మర్దించెను = కొట్టెను. కొండెములు = నేరములు, మడుగు = చెలువు.

ప్రశ్నలు:— కృష్ణుఁడు గోపికల ఇండ్లలో చేసిన కొంటెపను లేవి? గోపికలు చెప్పిన నేరములు విని యశోద యేమనెను? ఆమె కృష్ణుని ఏమనెను? కృష్ణుఁడు అంతట యేమిచేసెను?

---

# 29. కాళీయమర్దనము.

బాలకృష్ణుఁడు తనస్నేహితులతో కాళింది మడుగు దగ్గఱకు వచ్చెను.

అక్కడ స్నేహితులను దగ్గఱకు పిలిచి వారితో కృష్ణు డిటులనెను. "మాయమ్మ నన్ను కోపించినది. అందుచే నేను ఈమడుగులో పడి చచ్చిపోయెదను. ఈ సంగతి మీరు వెళ్ళి మాయమ్మకు చెప్పుడు." ఆ పలుకులు విని భయపడి గొల్లపిల్లలు వద్దువద్దని కేకలు వేసిరి. కృష్ణుఁడు స్నేహితుల మాటలు లక్ష్యపెట్టక యొడ్డుననే యున్న చెట్టెక్కి దాని కొమ్మమీదనుండి తటాలున మడుగులోనికి దుమికెను.

గొల్లపిల్లలేడ్చుచువచ్చి యీవార్త యశోదతో చెప్పిరి. యశోద నెత్తియు నోరు మోదుకొనుచు నందునితో చెప్పెను. నందుఁడు గుండెలు బాదుకొనుచు మడుగువైపు

పరుగెత్తెను. ఈసంగతి క్షణములో గ్రామమంతటను తెలిసి వది. ఊరిలోనివారందఱును విచారించుచు నందయశోదలతో మడుగుదగ్గఱకు వచ్చిరి.



వారువచ్చి చూచునప్పటికి కాళిందిమడుగులో పెద్ద పాము పడగలెత్తి యుండెను ఆ పడగలమీఁద కృష్ణుఁడు

చిఱునవ్వుతో నాట్యము చేయుచుండెను. ఆ పాము నోళ్ళ నుండి రక్తము కాఱుచుండెను. ఆపాము పేరు కాళీయుఁడు. కాళీయుఁడు కృష్ణుని కాలితాపులను భరింపలేక చచ్చిపోవు టకు సిద్ధమైయుండెను. అప్పుడు కాళీయునిభార్యలు మడుగులో నుండి పైకివచ్చి తమభర్తను రక్షింపుమని కృష్ణుని బ్రతిమాలిరి.

ఉ. నేరములెన్న నెక్కడివి నేము తలంచు తలంపులందులో
నేరములున్న వే సుతుల నేరమిఁ దండ్రులు త్రోచిపుచ్చరే
నేరముసేయువారి ధరణీపతు లోర్వక మాటుగావరే?
నేరముగల్గు మద్విభుని నేఁడిట గావఁగదే దయానిధీ!

కృష్ణుఁడు చంపక ఆపామును విడిచి మడుగులోనుండి యొడ్డునకు వచ్చెను.

చచ్చిపోయినాఁడనుకొన్నకృష్ణుఁడు పామును మర్దించి మడుగులోనుండి రాఁగానే తల్లిదండ్రులు పొందిన సంతో షము చెప్ప తరముకాదు. ఇట్లు భగవంతుఁడగు కృష్ణుఁడు చాలమంది దుర్మార్గులను శిక్షించి లోకమును రక్షించెను.

మాటలు:—కాళీయమర్దనము = కాళీయుఁడను పామును కొట్టుట, మోదు కొనుచు = కొట్టుకొనుచు, ధరణీపతులు = రాజులు, మద్విభుని = మాభర్తను.

ప్రశ్నలు:—కృష్ణుఁడు కాళింది మడుగువద్దకు ఏలవచ్చెను? అతఁడు తన స్నేహితులతో ఏమనెను? నందయశోదలు వచ్చి చూచుసరికి కృష్ణుఁడేమి చేయుచుండెను? కాళీయుని కృష్ణుఁడేల చంపలేదు? కాళీయుని భార్యలు కృష్ణుని యేమని వేడుకొనిరి?

# 30. నీతిపద్యములు.



క. తనకుల ధర్మమువిడువక
మనుట పరమధర్మ మండ్రు మాన్యులు చిత్తం
బునఁ గృపగలుగుట ముఖ్యపు
బని సైరణ వలయు నఖిల భావము లందున్. 1

టీ. మనుట = బ్రతుకుట, కృప = దయ, సైరణ=ఓర్పు.

క. పురుషుండు రెండు తెఱఁగుల
ధర నుత్తముఁ డనఁగ బరగుఁ దానెయ్యడలన్
బరుషములు వలుకకునికిన్
దురితంబులు వొరయుపనులు దొఱఁగుటవలనన్. 2

టీ. తెఱఁగుల = రీతుల, పరగును = ఒప్పును, ధర = భూమి, పరుషములు = చెడుమాటలు, ఉనికి = ఉండుట, దురితంబులువొరయు = పాపమువచ్చెడు.

క. ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటికా మాటలాడి యన్యుల మనముల్
నొప్పింపక తానొవ్వక
తప్పించుక తిరుగువాఁడు ధన్యుఁడు సుమతీ. 3

టీ. ప్రస్తుతమో = పనికిచ్చునో, అన్యుల = ఇతరుల, మనముల్ = మనస్సులు, ధన్యుఁడు = ఉత్తముఁడు.

ఆ. వె. గొడ్డుటావుఁబితుకఁ గుండఁ గొంపోయిన
బండ్లు రాల దన్నుఁ బాలు లేవు
లోభివాని నడుగ లాభంబు లేదయా
విశ్వదాభి రామ వినుర వేమ. 4

టీ. గొడ్డుటావు = పాలీయని ఆవు (ఈనని ఆవు.)

ఆ. వె. అల్పబుద్ధివాని కధికార మిచ్చిన
దొడ్డవారినెల్ల దొలఁగఁగొట్టు
చెప్పు తినెడు కుక్క చెఱకు తీపెఱుఁగునా
విశ్వదాభి రామ వినుర వేమ. 5

టీ. అల్పబుద్ధి = తక్కువబుద్ధి, దొడ్డవారు = మంచివారు.

క. అప్పిచ్చువాఁడు దాతయు
నెప్పుడు నెడ తెగక పాఱు నేరును ద్విజుఁడుం
జొప్పడిన యూర నుండుము
జొప్పడకున్నట్టి యూరుఁ జొరకుము సుమతీ. 6

టీ. దాత = ధర్మమిచ్చువాఁడు, ద్విజుఁడు = బ్రాహ్మణుఁడు, చొప్పడిన = అనుకూలమైన, చొరకుము = ప్రవేశింపకుము.

క. తన కోపమె తన శత్రువు
తన శాంతమె తనకు రక్ష దయచుట్టంబౌ
దన సంతోషమె స్వర్గము
తనదుఃఖమె నరక మండ్రు తథ్యము సుమతీ. 7

టీ. శాంతము = ఓర్పు, రక్ష = కాపాడునది, తథ్యము = నిజము.

క. కొఱగాని కొడుకు పుట్టిన
కొఱగామియె గాకతండ్రి గుణములఁ జెరచున్
జెఱకుతుద వెన్ను బుట్టినఁ
జెరకునఁ దీపెల్లఁ జెఱచు సిద్ధము సుమతీ. 8

టీ. కొఱగాని = పనికిరాని, సిద్ధము = నిజము.

క. తనవారు లేని చోటను
జనవించుక లేనిచోట జగడము చోటన్
అనుమానమైన చోటను
మనుజునకును నిలువఁదగదు మహిలో సుమతీ. 9

టీ. చనవు = పరిచయము, ఇంచుక = కొద్ది, మహిలో = లోకమునందు.

క. తల నుండు విషము ఫణికిని
వెలయంగాఁ దోఁక నుండు వృశ్చికమునకున్
దల తోఁక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ. 10

టీ. ఫణి = పాము, వెలయంగా = ఒప్పునట్లు, వృశ్చికము = తేలు, ఖలునకు = దుర్మార్గునకు.

---

# 31. విద్య.

గీ. విద్య యొసఁగును వినయంబు, వినయమునను
బడయుఁ బాత్రత పాత్రతవలన ధనము
ధనమువలనను ధర్మంబు దానివలన
నైహికాముష్మిక సుఖంబు లందు నరుఁడు. 1

టీ. వినయము = అడకువ, పాత్రత = యోగ్యత, ఐహికాముష్మిక సుఖములు = ఈలోకము నందును పరలోకమందును కలుగు సుఖములు, నరుఁడు = మనుష్యుఁడు.

క. ధనమును విద్యయు వంశం
బును దుర్మదులకు మదంబుఁబొనరించును స
జ్జనులైన వారి కడఁకువ
యును వినయము నివియు తెచ్చు నుర్వీనాథా. 2

టీ. దుర్మదులు = చెడ్డవారు, మదంబు=గర్వము, పొనరించును = కలిగించును, ఉర్వీనాథా = భూమికి ప్రభువా!

క. చదువని వాఁడజ్ఞుండగుఁ
జదివిన సదసద్వివేక చతురత గలుగున్
జదువఁగ వలయును జనులకుఁ
జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ! 3

టీ. అజ్ఞుఁడు = తెలివిలేనివాఁడు, సదసద్వివేకచతురత = మంచి చెడ్డలను తెలిసికొను నేర్పు, ఆర్యులు = పెద్దలు.

తే. గీ. అతిసమర్థుల కిల నసాధ్యంబు లేదు
పోల నుద్యోగికిని దూరభూమి లేదు
విద్యగలవాని కెందును వింత లేదు
వసుధఁ బ్రియవాదికిని శాత్రవంబు లేదు. 4

టీ. వసుధ = భూమి, ప్రియవాది = మంచిని చెప్పువాఁడు, శాత్రవంబు = విరోధము.

---

# 32. బాలకృష్ణుఁడు.



గోపికలు కృష్ణుని దుడుకుఁదనములను యశోదతో నిట్లు చెప్పిరి.

క. బాలురకుఁ బాలు లేవని
బాలింతలు మొఱలు వెట్టఁ బకపక నగి నీ
బాలుం డాలము సేయుచు
నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ! 1

టీ. ఆలము=యుద్ధము, ఆలకు = ఆవులకు, క్రేపులను=దూడలను.

క. పడతీ నీ బిడ్డడు మా
కడవలలో నున్న మంచి కాఁగిన పాలా
పడుచులకుఁ బోసి చిక్కిన
కడవలఁ బోనడిచె నాజ్ఞ గలదో లేదో! 2

టీ. పడతి = స్త్రీ, పోనడిచె = పోగొట్టెను.

క. మీ పాపఁడు మా గృహముల
నాపోవఁగఁ బాలుద్రావ నగపడకున్నన్

గోపించి పిన్న పడుచుల
వాపోవఁగ జిమ్ముకొనుచు వచ్చెన్ తల్లీ ! 3

టీ. పాపఁడు = బాలుఁడు, ఆపోవగ = తృప్తిగ, పిన్నపడుచుల పడుచుపిల్లల, వాపోవగ = అఱవగ, చిమ్ము = పొడుచు.

క. ఆడంజని వీరల పెరు
గోడక నీసుతుఁడు ద్రావి యొక యించుక తాఁ
గోడలి మూఁతిం జరిమినఁ
గోడలు ముచ్చనుచు నత్త గొట్టె లతాంగీ ! 4

టీ. ఆడంజని = ఆడుటకు వెళ్ళి, ముచ్చు = దొంగ.

క. వారిల్లుసొచ్చి గడవలఁ
దోరంబగు నెయ్యిద్రావి దఃడి నా కడవల్
వీరింట సి సుతుం డిడ
వారికి వీఁకిని దొడ్డవాదయ్యె సతీ ! 5

టీ. తోరంబగు = ఇంపగు, వాదు = జగడము.

క. వేలుపులకె నాకంబెను
వేలుపు మఱి యెవ్వఁడనుచు వికవిక నగి మా
వేలుపుల గోడపై నో
హేలావతి నీతనూజుఁ డంగిలి సేసెన్. 6

టీ. వేలుపు = దేవత, తనూజుఁడు = కొడుకు.

ఆ. వె. నమ్మి నిదుఁరవోవ నా పట్టి చుంచు మా
లేగతోఁకతోఁడ లీలఁగట్టి

వీధులందుఁ దోలె వెలఁది! నీకొమరుండు
రాచబిడ్డఁడైన అవ్వమేలె? 7

టీ. పట్టి=బిడ్డ, చుంచు=పిల్లజుట్టు, అవ్వ=నింద.

ఆ. వె. ఒకట నెక్కిరించు నొకొక్కచో మృగ
పక్షి ఘోషణములు పరగఁజేయు
నిట్లుచేసి వెనుక నెక్కడఁ బోవునో
కానరాఁడు రిత్తకడవలుంచు. 8

టీ. ఘోషణములు = అఱపులు, పరగ=ఒప్పునట్లు, రిత్తకడవలు=వట్టికుండలు.

క. కడులచ్చి గలిగెనేనిం
గుడుతురు గట్టుదురుగాక కొడుకుల నగుచున్
బడుగుల వాడలపైఁ బడ
విడుతురె రాకాంత లెందు విమలేందుముఖీ! 9

టీ. లచ్చి=భాగ్యము, కుడుతురు = భుజియింతురు, రాకాంతలు=రాచకులము నందలి స్త్రీలు, బడుగులు=శక్తిలేనివారు, వాడ=వీథి.

క. ఓయమ్మ నీ కుమారుఁడు
మాయిండ్లను బాలుపెరుగు మననియఁడమ్మా
పోయెద మెక్కడికైనను
మాయన్నల సురభులాన మంజులవాణీ! 10

టీ. మననియఁడు = ఉండనియ్యఁడు, సురభులాన = ఆవులతోడు, ఆన = ఒట్టు.

---

# వ్యాకరణము.

## 1-వ పాఠము.



### భాష.

నీవు నేర్చుకొనుచున్నది, నీవు మాట్లాడుచున్నది, నీవు వ్రాయుచున్నది తెనుఁగుభాష. మన తెనుఁగుభాషకు ఆంధ్రభాష అని మఱియొక పేరుగూడ కలదు. మన భాషకు రెండుపేరులు ఉండుటచేత మనకును రెండు పేరులుఉన్నవి. మనభాష తెనుఁగుభాష. కాఁబట్టి మనము తెనుఁగువారము. మన భాష ఆంధ్రభాష. కాఁబట్టి మనము ఆంధ్రులము.

ఇంగ్లీషు, అరవము, ఓఢ్రము అని ఇంకను ఎన్నో భాషలు ఉన్నవి. ఇంగ్లీషుభాష కలవారు ఇంగ్లీషువారు. అరవభాషకలవారు అరవలు. ఓఢ్రభాషకలవారు ఓఢ్రులు.

భాషను మనము రెండువిధములుగా వాడుచున్నాము. 1. మాట్లాడుట. 2. వ్రాయుట. మాట్లాడుటయందు కాని వ్రాయుటయందు కాని తప్పులుఉండకూడదు. తప్పులులేకుండ మాట్లాడుట, తప్పులులేకుండ వ్రాయుట, నేర్పుటకు ఒక శాస్త్రము ఉన్నది. ఆ శాస్త్రముపేరు వ్యాకరణము.

### అభ్యాసము.

1. మనము మాట్లాడుచున్నభాష ఏభాష ?
2. దానికి ఇంకొక పేరేమి ?

3. మఱికొన్ని భాషల పేరులు చెప్పుడు ?
4. మన భాషనుబట్టి మనకు ఏయే పేరులు వచ్చినవి ?
5. భాషను మనము ఏయే విధముల వాడుచున్నాము?

## 2-వ పా ఠ ము .

### —♦ అ క్ష ర ము లు ♦—

అక్షరములు రెండువిధములు. 1. అచ్చులు, 2. హల్లులు.
అచ్చులు:—అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః.
హల్లులు:—మిగిలిన అక్షరములు అన్నియు హల్లులే. అనఁగా

క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ ట ఠ డ ఢ ణ

త థ ద ధ న ప ఫ బ భ మ

య ర ఱ ల ళ వ శ ష స హ క్ష

అచ్చులకు "ప్రాణములు"అనిపేరు. హల్లులకుపొల్లులు అనిపేరు. ధాన్యములోనుండి బియ్యము తీసివేయగా మిగిలినది వట్టిపొల్లు. ఆపొల్లు ఎందుకును పనికిరాదు. అందులో బియ్యముఉన్నచో అదిపనికివచ్చును. అట్లే అచ్చులు లేకుండ హల్లులు పనికిరావు. "క" అను అక్షరము ఎట్లు వచ్చినదో చూతము క్ + అ = ఈరెండునుకలిసి 'క' అయినది. ఇందులో 'అ' లేకపోయినచో ఆమిగిలినపొల్లు నీవు పలుకలేవు. ఇట్లే క్ + ఆ = కా; క్ + ఇ = కి; క్ + ఈ = కీ; క్ + ఉ = కు; క్ + ఊ = కూ; క్ + ఎ = కె; క్ + ఏ = కే; క్ + ఐ = కై;

క్ + ఒ = కొ; క్ + ఓ = కో; క్ + ఔ = కౌ;
క్ + అం = కం; క్ + అః = కః.

అచ్చులేకుండ నీవు 'క' గుణితము పట్టలేవు. ఒక కాగుణితమే కాదు. కాఖా మొదలు యరలవ కొసవఱకుఉన్న అక్షరములలో ప్రతి అక్షరమునకు అచ్చులేకుండ గుణితము లేదు. త్ + అ = త; ప్ + అ = ప; మ్ + అ = మ; య్ + అ = య; ర్ + అ = ర; ఇట్లే అన్ని అక్షరములును వచ్చినవి.

ఇట్లు అచ్చులు హల్లులు అను పేరులతో తెనుఁగు భాషకు అక్షరములన్నియు ఏర్పడినవి. వీనిలో ఒక్క అక్షరముతో కాని రెండు అక్షరములతో కాని రెండిటి కంటె ఎక్కువ అక్షరములతో కాని కలిసి మాటలు ఏర్పడుచున్నవి చూడు:—

ఒక్క అక్షరముగల మాటలు.

1. 'తే' (ఆపుస్తకము ఇచ్చుటకు తే)
2. 'పో' (నీవు యింటికి పో)
3. 'రా' (నీవు బడికి రా)

రెండు అక్షరములుగల మాటలు.

1. 'బడి' (బడి అయ్యవారు మంచివారు)
2. 'కథ' (వారు ఒక కథ చెప్పిరి)
3. 'నీతి' (ఆకథలో నీతి ఉన్నది)

రెండింటికంటె ఎక్కువ అక్షరములుగల మాటలు.

పలక, పుస్తకము, ఉపాధ్యాయుఁడు, చెన్నపట్టణము, రాజసూయయాగము, దశరథుఁడు మొదలైనవి.

## అ భ్యా స ము .

1. తెనుఁగుభాషలో ఉన్న అక్షరములుఎన్నివిధములు?
2. వాని పేరు లేమి ?
3. అచ్చులకు మఱియొక పేరు ఏది ?
4. హల్లులు అనఁగా ఏమి ?
5. అచ్చులకు హల్లులకు ఏమి సంబంధము కలదు ?
6 'క' అను అక్షరము ఎట్లువచ్చినదో వ్రాసిచూపుము?
7. 'కాకి' ఈ మాటలో ఏయే అచ్చులు ఉన్నవో చెప్పుము ?
8. మాటలు ఎట్లు ఏర్పడుచున్నవి ?

## 3-వ పా ఠ ము .

## మా ట లు .

మాటలకు 'పదములు' 'శబ్దములు' అను పేరులుకూడ ఉన్నవి. ఇవి రెండు విధములు. (1) ఏకవచనము, (2) బహువచనము. ఒక్క మనుష్యునిగాని, ఒక్కవస్తువునుగాని, లేక మఱిదేనినైనను ఒక్కదానినే చెప్పుపదము ఏకవచనము.

రాముఁడు, కృష్ణుఁడు, పుల్ల, బల్ల, పుస్తకము, మొదలైనవి. ఒకటికంటె ఎక్కువ సంఖ్య చెప్పు పదములు బహువచనములు.

రాములు, కృష్ణులు, బల్లలు, పుల్లలు, పుస్తకములు మొదలైనవి.

'లు' అను అక్షరము బహువచనమునకు గుఱుతు. ఈ గుఱుతు, మాటలకు చివరనుండును. ఒక ఏకవచనమునకు చివర 'లు' చేర్చుము. అది బహువచనము కాఁగలదు. పుస్తకము + లు = పుస్తకములు.

ఇట్లే మఱికొన్ని.

| ఏకవచనము. | బహువచనము. |
| --- | --- |
| వనము | వనములు |
| తాళము | తాళములు |
| కత్తి | కత్తులు |
| గొలుసు | గొలుసులు |
| కాగితము | కాగితములు |
| కష్టము | కష్టములు |
| వర్షము | వర్షములు |
| కథ | కథలు |

రాముడు అనునది ఒక మనుష్యుని పేరు. ఈ పేరులో చివర 'డు' అను అక్షరము ఉన్నది. ఈ 'డు' అను అక్షరము చివరనున్న మనుష్యుల పేరులు ఇంకను ఎన్నో ఉన్నవి.

రాముఁడు, కృష్ణుఁడు, గోవిందుఁడు, బలరాముఁడు, హనుమంతుఁడు, లక్ష్మణుఁడు, భీముఁడు మొదలైనవి.

ఇవి అన్నియు ఏకవచనములు. ఏకవచనమును బహు వచనము చేయుటకు ఏమిచేయవలయు? కొసను 'లు' అను అక్షరము చేర్పవలయునుగదా? ఏదీ? రాముఁడు అను ఏక వచనమునకు 'లు' చేర్చి బహువచనము చేయుము?
రాముఁడు + లు = రాముఁడులు.

రాముఁడులు, కృష్ణుఁడులు, అను మాటలు తప్పు మాటలు. ఇట్టి మాటలు ఎప్పుడును ఉండవు. ఈతప్పుమాట లకు సరియైన మాటలు, రాములు, కృష్ణులు. ఈమాటలకు ఏకవచనములో ఉన్న 'డు' బహువచనములో పోయినది. దీనినిబట్టి నీవు నేర్చుకొనవలసినది ఏమనఁగా:— 'డు' చివర ఉన్న ఒక మనుష్యుని పేరు బహువచనము కాఁగానే ఆ 'డు' పోవుచుండును. రాముఁడు + లు = రాములు.

ఇట్లే మఱికొన్ని.

| ఏకవచనము | బహువచనము |
|---|---|
| కృష్ణుఁడు | కృష్ణులు. |
| గోవిందుఁడు | గోవిందులు. |
| బలరాముఁడు | బలరాములు. |
| హనుమంతుఁడు | హనుమంతులు. |
| లక్ష్మణుఁడు | లక్ష్మణులు |
| భీముఁడు | భీములు. |

వెంకయ్య, రామయ్య, అనునవి కూడ మనుష్యుల పేరులే. అయితే ఈ పేరులలో 'డు' లేదు. అందుచేత బహు

వచనము అయినప్పుడు ఈ పేరులలో పోవలసినది ఏమియు లేదు. వెంకయ్య + లు = వెంకయ్యలు, రామయ్య + రామయ్యలు.

ఇట్లే మఱికొన్ని.

| | |
|---|---|
| ఏకవచనము | బహువచనము. |
| కామయ్య | కామయ్యలు. |
| తాతయ్య | తాతయ్యలు. |
| రామన్న | రామన్నలు. |
| భీమన్న | భీమన్నలు. |
| పోతన్న | పోతన్నలు. |
| తిమ్మన్న | తిమ్మన్నలు. |
| సీత | సీతలు |
| రాధ | రాధలు. |
| అహల్య | అహల్యలు. |

అభ్యాసము.

1. మాటలు ఎన్ని విధములు?
2. ఏకవచనము అనఁగా ఏమి?
3. బహువచనము అనఁగా ఏమి?
4. ఏకవచనము ఎట్లు బహువచనము కాఁగలదు?
5. 'రాముడు' ఇది ఏవచనము?
6. దీని బహువచనము ఎట్లుండును?
7. ఇందులోఁ గలిగిన మార్పు ఏమి?
8. ఇట్టివి మఱి మూఁడింటిని జెప్పుము?